## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001004

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals
Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నారదోపన్యాసములు.





పిశిపాటి సత్యనారాయణ,
రిపోర్టర్ "రంగూన్ డెయిలీన్యూస్"

1933 [వెల 0-6-0.

# ఎఱుక.



ఈ గ్రంథకర్త చిరంజీవి సత్యనారాయణ తమ్మునివావి కన్నఁ గూర్చువాఁడు. ఈతని రచనయు నా యర్మిలి కొప్పినది. పెద్దపెద్ద విషయములు తేటతెనుఁగున వాడుకమాటలలో వ్రాయబడిన "నారదోపన్యాసములు" జనసామాన్యమునకుఁ బ్రయోజనకారు లగును. ఈయన రచన చేఁరాట్నమున వడికి మగ్గమున నేసిన ముసుగుబట్టవంటిది. నేతనాణెము లేదు; అంచుకట్టునాజూకు లేదు; జరీబుటాలనగిషీ లేదు; అచ్చము దేశవాళి సరుకు. చంటిబిడ్డ చూపునందలి తేటయుఁ, గులకాంత చరిత్రయందలి సౌశీల్యమును కనులుగలవారు ఈయన రచనలోఁ జూడఁగలరు. ఇందుఁ జర్చితములయిన వస్తువులు, ఊటి ఊఱని ఊరగాయవలె, పూర్ణపరిపాకమునకు రాని యనుభవమును చిత్తవృత్తిని అందించి యూరించుచున్నవి. ఇది తొలిజతన మయ్యు మెచ్చన కొకమచ్చయినది.

చదువరుల ప్రోత్సాహమునుబట్టి మరికొన్ని లోకసామాన్య విషయములు ఇట్టివి సావధానముగ వ్రాయుట కనువుపడును. 'మానాన్న ............గ్రంథకర్త.........యయ్యె.........నని నెచ్చెలులకుఁ జెప్పుకొని ముచ్చటపడవలయు నాన్నగారు కాలగర్భముజొచ్చి రగుట ఆముచ్చటలన్నియు నాపాలబడినవి. ప్రకృతిజననియొడిలో నుయ్యాల లూగు రామచంద్రయ్యగారి భూతపంచకము, అక్షరరూపమునఁ బెద్దకొడుకిచ్చు నివాపోదకము నందికొనుగాక !

చిరంజీవి సత్యనారాయణుడు జగత్కుటుంబి యగుగాక.

దేవపత్తమ్, ఏలూరు.

తదీయుఁడు,
మున్నంగి శర్మ.



# నివేదిక.



"ఐరావతి" (రంగూనులోని తెలుఁగు) పత్రికాముఖమున, నప్పుడప్పుడు లోక వ్యవహారములను గుఱించి "నారదోపన్యాసము"లపేరఁ, గొన్ని విమర్శలు వ్రాసితిని. అవి ఎల్లవారికి ఉద్బోధకములుగా నుండఁగలవని తలంచిన మిత్రులు గొందఱు వానిని సమీకరించి పుస్తకరూపమునఁ బ్రకటింపుమని తఱచు హెచ్చరించిరి. ఆ హెచ్చరిక నూతగాఁగొని నా యల్పజ్ఞతనుగూడఁ దలంపక, "ఐరావతి" పత్రికాధిపతి శ్రీ వెలగల వేంకటరెడ్డిగారి యనుమతితో, ఈ పుస్తకము వెలువరింపఁ దెగించితిని.

ఈ నా యుపన్యాసములు నా యల్పానుభవముంబట్టి వ్రాయబడినవి. వారు వారు తమ తమ అనుభవములతో సమన్వయించుకొనినచో నుపన్యాసములందలి విషయములు గొంతవఱకేని సరిపడవచ్చును. మానవ ప్రవృత్తులు, భిన్నములు; సన్నివేశములును సందర్భములును భిన్నములు. అట్లుగావునఁ గొన్ని పట్టులలో నెవరియనుభవము వారిదిగా నగపడును. లోకసామాన్యములగు సమస్యలయందు, సాధారణముగ, మానవుని యనుభవము వ్యత్యస్తముగాను. ఈ నా సమీకరణమునందలి విషయము వారు వారు, ఉపకరించినంతవఱకు, గ్రహింతురుగాక

ఈ యుపన్యాసములను సంస్కరించి ముద్రణాదికము నిర్వహించిన శ్రీ మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను. ఈ పుస్తకమును ముద్రించుట మొదలుగా నెల్లపనుల నాకుఁ దోడ్పడిన నా చిన్నితమ్ముని చిరంజీవుని విశ్వనాథుని మనసార దీవింతును.

**259, 40** వ వీధి
రంగూన్,
**1—1—1933.**

పిశిపాటి సత్యనారాయణ,
గ్రంథకర్త.

శ్రీరామచంద్రసహాయః.

# నారదోపన్యాసము.

## 1-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదు డిట్లుపన్యసించుచున్నాడు.)

---

చదువు లన్నిటిలో మానవస్వభావము నెరుంగుట చాల గొప్ప దని షేక్స్పియరుమహాకవి నుడివినాడు. మానవ స్వభావము అనగా మనిషియొక్క నైజగుణము. లోకములో మనుజుడు తనజీవితమున సఫలత బొందవలెనసిన మానవ స్వభావమును దెలిసికొనుట యావశ్యకము. ఎంతటి విద్యావంతులైనను, ధనవంతులైనను, నేతలైనను మానవ స్వభావము తెలిసికొననిచో వారి జీవితాశయము నిష్ఫలము. ఎట్టి విద్యావంతులైనను, ఎంతగొప్పనాయకులైనను కొంతమంది విఫలప్రయత్నులగుటకు గారణమేమి? సాధారణముగా పురుషునకు శత్రువు లెట్లు ప్రాప్తింతురు? మనస్పర్థలు వైషమ్యములు, కొట్లాటలు, యుద్ధములుగూడ నెందుకు పుట్టుచుండును? లోకములో నింతఅశాంతికి కారణమేమి? వీటి కన్నిటికి కారణము: మానవస్వభావమును సరిగ గ్రహింపక పోవుటయే. దానిని సరిగ గుర్తించినవారికి లోకములో నేవిధమైన చింతయుండదు; శత్రువులుండరు.

అంతయుసహజముగనే కనబడును. గాని పొరపాటొక్కటియు కనపడదు.

మానవస్వభావమును కనిపట్టుటకు పూర్వము ఈశ్వరసృష్టి విధానముయొక్క పునాదికి వెడలవలయును. సృష్టిలో మానవసృష్టి విశిష్టమయినది. ఈశ్వరకృతమైన వాటికి ఎప్పటికిని మార్పుగలుగదు. చింతపండు పుల్లగా, పంచదార తియ్యగా సృష్టింపబడినవి. ఎన్నివందల సంవత్సరములైనను చింతపండు తియ్యగాను, పంచదార పుల్లగాను ఉండునా? వేసంగిలో ఎండలు తీవ్రముగానుండును. వానకాలములో వానలు అధికముగానుండును. సృష్ట్యాదినుండియు ఎప్పుడైన వేసంగిలో వానలుకురియుట వానకాలములో ఎండలు కాయుట వినియున్నామా? ఇంకా అనేక ఉదాహరణములు చెప్పవచ్చును. ముఖ్యమయిన విషయ మేమనగా: ఈశ్వర సృష్టిలో మాత్రము మార్పుగలుగ జాలదు. అటులనే లోకము పుట్టినప్పటి నుండియు మానవస్వభావములో మార్పేమయినను కలిగినదా? ఏకాలమందును, ఏ దేశమందును మానవస్వభావ మొక్కతీరున నున్నది. ఈ స్వభావము లోక మున్నంతవఱకును యుండి తీఱవలసినదే. లోకములో మంచివారు చెడ్డవారు గలరు. లోకమునుండి దుర్మార్గమును పూర్తిగా తొలగించుట సాధ్యమా? లోకుల నందఱను సాధువులుగ మార్చుట శక్యమా? బుద్ధుడు, ఏసుక్రీస్తు,

మహమ్మదు, రామకృష్ణ పరమహంస మొదలైన భగవ దంశసంభూతులు లోకోపకారమునకై యవతరించిరి గాని వారేమైనను లోకమునుండి దుర్మార్గమును పొలుద్రోల గలిగిరా? మంచిచెడ్డలు సృష్టితోఁ బుట్టినవి. దేవుడు ప్రాణికోటితో నీడను సృష్టించినా సృష్టింపకపోయినా అది వెన్వెంటనే యున్నది. అటులనే పగలు, రాత్రి, పూర్ణిమ అమావాస్య, మంచి చెడ్డ, సుఖము దుఃఖము, ఆరోగ్యము రోగము మొదలైనవి. మన నేతలు కొంతమంది లోకములో నుండు దుర్మార్గము నణచివేయుటకు బ్రయత్నింతురు. ఇది, మానవస్వభావముం దెలియక ప్రకృతిరహస్యము పరికింపక చేయుప్రయత్నము. లోకమునుండి చెడుగును విడదీయుటకు వీలుగాదు గాని, మనలోనుండు మలినము మాత్రము తొల గించుట సాధ్యమగును. ఇండియను పీనలుకోడ్డు సెక్షనులక్రింద ప్రతిదినము ఎంతమందిరో దండింపబడుచున్నారు. కాని నేరము లేమైనను తగ్గుచున్నవా? కాబట్టి మానవస్వభావ మును మార్చుట దుస్తరము.

లోకము ఒక అద్దము వంటిది. అద్దమున మన నిజ స్వరూపమేగాని తదితరరూపము గనబడ జాలదు. అటులనే లోకములో గూడ మనమనస్సు మనహృదయమే ప్రతి బింబించును. అనగా మనవలెనే లోకముగూడ మనకు గన బడును. అనగా మంచివారికి మంచిగాను, చెడ్డవారికి చెడ్డగాను

కనబడును. మంచిచెడ్డ లనునవి మనస్సులోని వికారములు; లోకమునకును మనకును సంబంధము మనమంచిచెడ్డలపై నాధారపడియున్నది. లోక మెప్పుడును మంచివారిని మంచిగాను చెడ్డవారిని చెడ్డగాను గుర్తించును. లోకాభిప్రాయము ఒక్కొకప్పుడు భ్రమప్రమాదములకు లోనగుచుండును. లోకాభిప్రాయములను లెక్కింపక ఆత్మశోధనమునకుఁ గడంగుట సజ్జన లక్షణము.

ఈ స్వభావపరిశీలనము పసిఫిక్ మహాసముద్రమునకంటె విరివియయినది; లోతయినది. ఈ యగాధమునం బ్రవేశించి మునుఁగకుండ తేలి ఒడ్డుచేరునట్లు మెలఁకువతో మెలఁగవలయును.

---

## 2-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదు డిట్లుపన్యసించుచున్నాఁడు.)

---

కడచినయుపన్యాసములో ప్రతిపురుషుడు ఆత్మపరిశోధన చేసికొనుచుండ వలయునని జెప్పితిని. ఆత్మపరిశోధన యనగా మన మనస్సును మనము ఎల్లపుడు పరీక్షించు కొనుచుండవలెను. అనగా మనముచేయు కార్యములు మంచివా? చెడ్డవా? యను విచారణ సల్పు

చుండవలయును. లోకములో కొంతమంది తమకు గలుగు అపజయమునకు, అపకీర్తికి, అగౌరవమునకు నితరులను బాధ్యులనుగా జేసి వారిని నిందించుచుందురు. ఒక యుదాహరణము చూడుడు. నేనొకసంఘమును స్థాపించితి ననుకోండి. ఆసంఘము ఏకారణముచేతనో కొన్నిమాసములు మాత్రమే జీవించి పిమ్మట అంతమొందును. ఈ సంఘమంతమొందుటకు నే నితరులను నిందించుటవలన ఏమి ప్రయోజనము? ప్రపంచములో ఎన్నిసంఘములో పుట్టుచు గిట్టుచుండును. ఎన్నియోసంఘములు చక్కగా పని చేయుచుండగా ఈ సంఘముమాత్రము ఇంతలో అంతరింప నేల? దీనికి గారణము సంఘమును స్థాపించి నిర్వహించుచున్న నేనై యుండవలయును. ఆత్మపరిశోధన జేసికొనినచో నాపొరపాటు నాకు కనబడగలదు. ఆత్మపరిశోధన చేసికొనక, నాపొరపాటును నేను గ్రహింపక ఇతరులను నిందించుచున్నంతవఱకు నాప్రయత్నమెన్నటికి సఫలము కాజాలదు కాబట్టి ప్రతిమనుజునకు ఆత్మపరిశోధన మావశ్యకము. తనతప్పులను పొరబాట్లను గ్రహించి వాటిని దిద్దుకొనక మూరపద్ధతి యవలంబించినచో నించుకైనను ప్రయోజన ముండదు.

ఏపనినైనను మనము త్రికరణశుద్ధిగా ఆత్మనిశ్చయముగ ప్రారంభించి కొనసాగించినచో సఫలముకాకమానదు.

అయ్యది విఫలమగుచో నందునకు మనమే బాధ్యులము. మనము రంగూనునుండి చెన్నపట్టణము వెళ్ళవలెననుకొండి! చెన్నపట్టణం వెళ్ళేస్టీమరును వదలి కలకత్తాస్టీమరెక్కి కలకత్తా చేరినతరువాత స్టీమరును నిందించుటలో ఏమైన నర్థముగలదా ? అటులనే మనదేశోద్ధరణకు సంబంధమైన యుద్యమములందుగూడ మనయుద్యమోద్దేశ్యము ప్రకారము పనిని సరిగ ప్రారంభింపనిచో గమ్యస్థానము చేరుకొనక యింకొకచోటికి చేరుకొందుము. నేత లనువారియందు ఉద్యమమును దృఢమగు నియమములతోఁ బ్రారంభింపవలసిన బాధ్యత ఎక్కుడుగఁ గలదు. కాఁబట్టి దేశోద్ధారకులు, దేశోపకారులు నగు నేతలు మొదలయిన మహానుభావు లందఱును ఈ పరమార్థమును గుర్తించుటవసరము. ఈధర్మ సూక్ష్మమును ఈజీవరహస్యమును ఉపేక్షింతుమేని, ధనముకై త్రవ్విన దయ్యము వెడలినట్లు, మేలునకు మాఱు ఎనలేని కీడువాటిల్లును. కొంతమంది తమయందుండు తప్పులను పొర పాట్లను మాత్రము గుర్తింపలేక ఇతరులతప్పులను మాత్రము చులుకనగా కనిపట్టగలరు. గురువిందగింజ తనక్రింది నలుపును తాను చూడలేదట! తనకంటిలోని దూలమును చూడలేదు. గాని పరులకంటిలోని నలుసును కనిపట్టును. ఇట్టివార లెన్నడును ప్రయోజకులు కాజాలరు. "తప్పులెన్ను వారు తమతప్పు లెరుగరు" అను వేమనవాక్యము లీసందర్భమున కన్వయించును. ప్రతి మానవునియందు మంచిచెడ్డలు

రెండును కలసియుండును. పూర్తిగా మంచివారుకాని, పూర్తిగా చెడ్డవారుగాని యుండుట ప్రకృతివిరుద్ధము. ఒరులతప్పు లెన్నుట మనపనికాదు. ఎట్టి దుర్మార్గుసందైనను కొద్దో గొప్పో మంచి యుండకమానదు. ఆమంచిని మనము గుర్తింపవలయును. "ప్రమాదో ధీమతామపి" అన్నారు గాన, ఎట్టి మహాపుణ్యపురుషుఁడైనను పొరపాట్లకు గురి కాకుండడు. అట్టి పొరపాట్లను మనము గొప్పగాజేసి వానియందుండు మంచితనమును నిరసింపగూడదు. ఇం కొకవిషయమే మనగా మన మెంతమంచిగా నున్నను ప్రజోపయోగకరములైన కార్యముల నెన్నిటిని జేయుచున్నను వీటినన్నిటిని నణచివైచి మనయందుండు చెడ్డతనమును గోరంతలు కొండంతలుజేసి అల్లరి పెట్టుటకే లోకము ప్రయత్నించుచుండును. మన మెన్నికార్యములు జేసినను ఒక్కచెడ్డపని జేసినచో గిన్నెడుపాలలో నొక విషబిందువువలె దానినే లోకము దెప్పిపొడుచు చుండును. ముఖ్యముగా నేతలైనవారీ విషబిందువును కలియనీయకుండ జాగ్రత్తగా నుండవలెను. మన మెన్నిమంచికార్యములుఁ జేసినను మనము చేయు చెడుకార్యమునకు లోకాపవాదము తప్పక పడవలసినదే. అట్టి అవకాశము కలుగజేయుట మన తప్పుగాని లోకము తప్పుగాదు.

ఎట్టి సదుద్యమమును, ప్రారంభించినను విరుద్ధవాయువులు వీచుట లోకముతీరు. పుణ్యకర్మము లనబడు యజ్ఞ

యాగాది క్రతువులకు స్వర్గీయులగు దేవతలే విఘ్నములను గల్పింతురని చెప్పబడుచుండగా నిక మానవమాత్రులు మంచి పనులను ప్రతిరోధింతురనుటలో వింత యేది గలదు ? అంత మాత్రమున మనము నిరుత్సాహముజెంది యుద్యమమును మానివేయగూడదు. ప్రతిరోధములను మనస్ఫూర్తిగా నాహ్వానింపవలెను. నిరోధము లధికములగుకొలది ఉద్యమము బలవంతమగును. అట్టి శత్రుత్వము శాశ్వతముగాను బలవంతముగాను వర్ధిల్లుట కవకాశ మేర్పడును. అంతియగాని మన శత్రువుల ననవసరముగ మనము దూషించి వారిని అక్రమ పద్ధతులచే తొలగింపబూనుట పురుషులలక్షణముగాదు.

---

## 3-వ అధ్యాయము.

(త్రిలోక సంచారి నారదుడు తన యుపన్యాసము నిట్లు సాగించుచున్నాడు.)



కడచిన యుపన్యాసములో మన యుద్యమమునకు ఎంత అడ్డు కలిగితే అంత మంచిదనియు దాని నణచివేయుటకు మాఱుగ నాహ్వానింపనే వలయుననియు చెప్పితిని. మనయుద్యమమును సమగ్రముగా విమర్శించి నపుడె దాని యందుండు లోటుపాట్లను గ్రహించి వాటిని దిద్దుకొనుట కవకాశము కలుగును. అడ్డులవలనను, విమర్శలవలనను మన మించుకైనను భయపడ నవసరము లేదు. మనయుద్యమము

ధర్మసమంచితమును, సత్యసమ్మతమును ఐనచో ఎన్ని యద్ధులు వచ్చినను తప్పక విజయముపొందితీరును. అధర్మము, అన్యాయము, అసత్యము చిట్టచివరకు విజయము పొందవు. ఉద్యమప్రచారకులు ముష్కరులుగ నుండగూడదు. అనగా తాపట్టిన కుందేటికి మూడే కాళ్ళని వాదింప గూడదు. అనగా తాము చేయున దంతయు సరి యనియు ఇతరుల విమర్శన లన్నియు తప్పనియు యెన్నటికిని దలపగూడదు. ఇతరుల విమర్శన లెంతవరకు న్యాయబద్ధములో ఎంతవరకు న్యాయవిరుద్ధములో మనము గ్రహించుటకు సూక్ష్మ బుద్ధి కలిగి యుండవలెను. వారి విమర్శలు న్యాయ దూరములైనచో త్రోసివేయవలయును. న్యాయములైనచో మన పొరపాట్లను మనము యొప్పికొని దిద్దుకొనుటకు సిద్ధముగా నుండవలెను. నిప్పులేనిది పొగపుట్టదు. ప్రజాభి ప్రాయము మంచిదైనను, చెడ్డదైనను ఊరకే పుట్టదు. ఇంతకు మనము చేయుపని యంతయు ప్రజాభిప్రాయము ననుసరించు చుండును. ప్రజాభిప్రాయము మన కనుకూలముగ లేనిచో దాని కేదో కారణ ముండి యుండవలయును. ఆపొరపాటు మరల మనయందే యుండియుండును. అది మన కనుకూలముగ లేనపుడు దానిని నిందించిన ప్రయోజనము లేదు. దానిని మన కనుకూలముగ జేసికొనుట మన ప్రథమ కర్తవ్యము. ఒకనాయకు డుండేవాడు. ఆయన చేయుపని మంచిదైనను ప్రజాభిప్రాయము మాత్ర మాయన కనుకూల

ముగ ఉండేదికాదు. దానికి కారణము కనిపట్టకుండా ఊరికే ప్రజలను నిందించేవాడు. ఫలిత మేమనగా: ఆయన తలపెట్టిన కార్యము జయము కాకపోవుటయే. కాబట్టి నేను జెప్పే దేమిటంటే మన అపజయమునకు కారణము మనమే గాని ప్రజాభిప్రాయ మెన్నటికిని గాదు.

ఉద్యమముల విషయములలో నెట్లో సామాన్యమనుష్యుల విషయములోనూ అట్లే. సాధారణముగా లోకములో మనుష్యులకు ఆత్మస్తుతి యనిన నెక్కువ యిష్టము. తమ యందుండు తప్పులను పొరబాట్లను పరులెంచుట ఇష్టముండదు. ఇది కేవలము మానవస్వభావము. కానినిజముగా నభివృద్ధి జెందదలచిన పురుషుడు ఆత్మస్తుతికి లెక్కజేయకూడదు. తనయందుండు పొరబాట్లను కనబఱుపుమని గోరుచుండవలెను. ఆత్మస్తుతి చేయువారు మన శత్రువులు. మన యభ్యున్నతినిగోరి మనయందుండు తప్పులను కనబఱుచువారే మనకు నిజమైన మిత్రులు. కాబట్టి మన మెప్పుడును మన శత్రువులను సరకు జేయక మిత్రులనే యాహ్వానించుచుండవలెను. అనగా మనలను స్తుతి చేసినపుడు ఉబ్బిపోకూడదు. నిందించినపుడు కోపగించి అధైర్యపడకూడదు. మనలను నిందించి నపుడు కోపము జెందుటకు మాఱుగ మనము సంతసముజెంది మన పొరపాట్లను కనిపెట్టినందులకు వారికి గృతజ్ఞులమై యుండవలెను. ఎల్లపుడును ఆత్మస్తుతిని

గోరువారు (Those who live in fools paradise) విమర్శ నలకు భయపడువారు ఎన్నటికిని అభివృద్ధి జెందలేరు.

మానవస్వభావములో నింకొక విశేష మేమనగా మన కేమయినను కష్టములు సంప్రాప్త మయినపుడు దేవుని నిందించుచుందుము. ఏదైనను వ్యతిరేకముగా జరిగినపుడు దేవుడు పొరపడినాడని తలంచుచుందుము. మన మనుకున్న పని కానపుడు దేవుడున్నాడా లేడా యను శంకకూడ మనకు కలుగుచుండును. ఈ విధముగా శంకించు చుండువా రింకను చాలా వెనుకబడి యున్నారన్నమాట. దైవసృష్టి విచిత్రమైనది. సూర్య - చంద్రాదులను (Solar system) సృష్టించిన మహానుభావుడు పొరపడి యుండడు. అణువు మొదలు బ్రహ్మావలకు నిండియున్న యీ బ్రహ్మాండమైన సృష్టిలో ఒక్క పొరపాటైనను యుండనేరదు. యుగ యుగములనుండి సూర్యుడు తనకాలము ప్రకారము అదనునకు సరిగా దూర్పున నుదయించుట, పశ్చిమమున నస్తమించుట మనము గాంచుచున్నాముగదా! ఒక్క నిమిషము ఆలస్యముగా సూర్యుడు ఉదయించినచో లోకమున కెంతహాని కలుగునో యూహింపుడు. లోకము ఏదో గ్రుడ్డిదుగా సృష్టింపబడలేదు. ఒకదానికి మఱొకదానికి ఏమీ సంబంధము లేకుండాలేదు. మనము మొట్టమొదట చేయవలసిన పని ఏమనగా సృష్టి విధానమును బాగుగ గ్రహింప

వలయును. దానినుండి మనము నేర్చుకొనవలసిన దెంతయో యున్నది. సృష్టివిధానమును సరిగ పరికించినచో లోకములో ఒకవిధమైన క్రమము పద్ధతి (Order system and method) యున్నట్లు మనకు బోధపడును. మనప్రభుత్వమువలెనే దేవుని ప్రభుత్వముగూడ అనేక డిపార్టుమెంటులుగా విభజింపబడినది. ఆయాడిపార్టుమెంటు అధికారులు తమ తమ విధ్యుక్తములను నిర్వహించుచున్నారు. సృష్టిలో అనవసరమైన వస్తువు ఒకటియు నుండదు. పొరపాటంతకంటె నుండదు. వీటిని మనము సరిగ గ్రహింప జాలమికి మన తెలివితక్కువయే కారణము. మనకు తగినంత జ్ఞానమున్నచో సృష్టిలో పొరబాటేమియు కనబడదు. అంతయు సక్రమముగనే కనంబడును. మనకు కలుగు కష్టములు నష్టములన్నియు నిజమైన నష్టములుగావు. అవి తాత్కాలికముగ కష్టములుగ గనబడినను, వాటినుండి ఉత్తరోత్తరలాభము కలుగకమానదు. మన జీవితమందలి కష్టసుఖములను మనము సరిగ అన్వయింప జేసికొనినచో దీని యాథార్థ్యము బోధపడగలదు. మనిషినిర్ణయించినదానికంటె దేవుడు నిర్ణయించినదే మేలు (What God chooses is better than what man chooses). కాబట్టి మనకు కష్టములు సంప్రాప్తమయినపుడు అధైర్యపడకూడదు. దేవుని నిందింపంగూడదు. "ధైర్యమ్ సర్వత్రసాధక" మ్మను నార్యోక్తి నూదియుండవలెను. దేవునియం దెప్పటికిని నమ్మకము విడిచిపెట్టంగూడదు. మనకు

కలుగు కష్టములన్నియు పరీక్షలని తలఁపవలెను. ఆపరీక్షలకు నిలువబడినవాఁడే పరమేశ్వరుని కటాక్షమునకుఁ బాత్ర మగును. ఎట్టికష్టములకేనిఁ దలయొగ్గి దేవునియందు నమ్మ కము వీడనివారికి మోక్షము నిశ్చయము.

---

## 4-వ అ ధ్యా య ము.

(త్రిలోక సంచారి నారదుడు ఇట్లు జెప్పుచున్నాడు.)



ఇంతవఱకు మూఁడు ఉపన్యాసములు వింటిరిగదా! ఇది నాల్గవ యుపన్యాసము. పూర్వోపన్యాసముల ధోరణినిబట్టి వాటియుద్దేశ్యమును సభ్యులు లిప్పటికి కొంతవరకు యూహించియుందురు. వాటియుద్దేశమును నే నించుక తెలియజేయు టవసరము. లోకములో మన మందఱమును అనేకవిధముల జీవించుచున్నారము. కొంత మంది యెన్నిసంవత్సరములు జీవించినను ఇంచుకైనను జ్ఞానము, అనుభవము, సంపాదింపవలయునను కోరిక యయినను గనపఱుపక కేవలము ధనసంపాదనకై తమ కాలమును గడపుచున్నారు. జన్మము లన్నిటిలోను మానవ జన్మ ముత్కృష్టమయినది. అందు పురుషజన్మము ఉత్తమ మైనది. ఈశ్వరసృష్టి అనాద్యము; అనంతము. ఇట్టిప్రపంచ ములనెన్నిటినో భగవంతుఁడు సృష్టించినాఁడని మనము విని

యున్నాము. అతనివలెనే అతనిసృష్టియు ఆద్యంతములు లేనిది. ఈసృష్టి అనేకులు అనేక విధములుగా దర్శించి వర్ణించినారు. దానితో మనకు ప్రకృతము ప్రసక్తము లేదు. దైవసృష్టిలో నొక భాగమగు మన ప్రకృతి ప్రపంచమును తిలకింపుడు! ఈ లోకము కోట్లకొలది ప్రజలతో నిండియున్నది. ఈ కోట్లలో మన మొక అణుమాత్రము. మనిషి అణుమాత్రమైనను అతడు సంపాదింపగల శక్తిసామర్థ్యముల కంతులేదు. అటువలెనే ఆతని అహంభావత్వమునకు గూడ మితిలేదు. ప్రతిమానవుని జీవితోద్దేశ్యము మోక్షదాయకమగు పరమానందమును సంపాదించుటకుదక్క వేరుకాదు. ఈ మోక్షముసంపాదించుటకే మనమందరమును తంటాలు పడుచున్నాము. కాని యీ మోక్షమును సంపాదించుటకు పూర్వము కొన్ని సంగతులను తెలిసికొనుట యావశ్యకము. మొట్టమొదట సృష్టి విధానమును తెలిసికొనవలయును. మనము వారిచేతను వీరి చేతను వ్రాయబడు గ్రంథముల జదువుటకంటె స్వయముగా ప్రకృతి ప్రబంధమునుచదివి దానినుండి పాఠములనునేర్చుకొన వలయును. గ్రంథము లనగా నేమి? ఆయాకాల పరిస్థితుల ననుసరించి తమ యనుభవములను గ్రంథకర్తలు ప్రపంచమున కొసగిరి. ఈ గ్రంథములందలి యనుభవము లన్నియు సర్వసాధారణముగా నొకేతీరున నుండును. మనముగూడ ప్రకృతి ప్రబంధమును చదివి మన యనుభమును పుస్తకములందలి

యనుభవములతో సరిపోల్చి చూచినచో రెండునూ నేకీభవించును. మన యనుభవ మటుల యేకీభవింపనిచో మనము నేర్చుకొన్న దానిలో నేదియో, పొరపా టున్నదన్నమాటే. మనచదువు సరిగలేదన్నమాట. గ్రంథముల ముఖ్యోద్దేశ్యము మన యనుభవములను వాటితో సరిపోల్చు కొనుటకు గాని వేరుకాదు. మనపాఠములను అనుభవమును స్వయంకృషిచే ప్రకృతినుండియే నేర్చుకొనుట మంచిది. దీనికొఱకు మొట్ట మొదట మన మెవరమో లోక మేమిటో యిరువురకును ఏమి సంబంధమో, మొదలైన వన్నియు తెలిసికొను టవసరము. వివేకానందస్వామి నిన్నుగురించి నీవు తెలిసికొనుము (Know Thy self) అని వచించి యున్నాడు. మనలోనే సర్వలోకరహస్యము సమస్త వేదాంతరహస్యము ఇమిడియున్నది. తన్నుతాను తెలిసికొనినవాడే సర్వజ్ఞుడు. తన్నుతాను తెలిసికొనుటకే సర్వవేదాంతగ్రంథముల సహాయము కావలసియున్నది. కాబట్టి లోకములో ముఖ్యమైనది వ్యక్తి. సర్వమును అవ్యక్తమందుగలదు. కాబట్టి లోకములో మనము మొట్టమొదట గుర్తింప వలసినది వ్యక్తియొక్క ప్రాముఖ్యము.

ఇప్పుడు నేనే యున్నాననుకోండి!— నే నుంటే అనగా నాలో జీవ మున్నంతవరకు నా కీ ప్రపంచమంతయు జీవించియుండును. నేను లేకపోతే నాకీ ప్రపంచమే లేదు. కాబట్టి

ప్రతివ్యక్తియు తన్నుదాను తెలిసికొనుటకు ప్రయత్నింప వలెను. మనలో సాధారణముగా కొంతమంది తమ్ము దాము తెలిసికొనలేక ఇతరులను తెలిసికొనుటకు ప్రయత్నించెదరు. ఎవరియిల్లును వారు చక్కబెట్టు కొన్నచో ఊరంతయు శుభ్రముగానుండును. నాఅభిప్రాయ మేమనగా ఏసంస్కరణమైనను ఏ అభివృద్ధియైనను మొట్ట మొదట వ్యక్తిలోనుండి బయలుదేరవలెను. ఈప్రకారముగా మన మాలోచించినచో లోకోపకారులు, గొప్ప గొప్ప వేదాంతులు, మతగురువులు, శాస్త్రజ్ఞులు, కవులు, సంస్కర్తలు, అనేకవ్యక్తులుగాని, వ్యక్తిసముదాయముగాదు. కాబట్టి ప్రతిమనుజుడును తన ప్రాముఖ్యము దెలిసికొను టవసరము. అద్వైతసిద్ధాంతప్రకారము ప్రతిమానవుడు "అహం బ్రహ్మ" అనగా నేనే బ్రహ్మ నని వక్కాణింపవచ్చును. అనగా ప్రతి మానవునకును బ్రహ్మత్వమును బొందుట కవకాశముకలదు. ఈ బ్రహ్మత్వమెట్లు లభ్యముకాగలదు? ప్రతివ్యక్తియు తన ప్రాముఖ్యమును తెలిసికొనినయెడలనే. కాబట్టి యీ యుపన్యాసముల ముఖ్యోద్దేశ్యము వ్యక్తి ప్రాముఖ్యమును నొక్కి వక్కాణింపజేయుట. మరియు ప్రకృతిప్రబంధమునుండి పాఠములను స్వయముగా సాధ్యమగు నంతవరకు నేర్చు కొమ్మని హెచ్చరించుట మనలనుగురించి మనము తెలిసి కొనుటకు ప్రారంభించినపుడే సర్వమును మనకు గ్రాహ్యా మగును. మనయందుండు మంచిచెడ్డలను లోటుపాట్లను

గ్రహించినపుడే యితరుల యందుంను లోటుపాట్లు బోధ పడును. మనలనుగురించి మనము తెలిసికొననంతవరకు మన మభివృద్ధి జెందలేము. జయాపజయములు దైవాధీనంబు లయినను తత్సాధనములు, మార్గములు మనలోనే యున్నవి. ప్రస్తుతము లోకమెంత గందరగోళముగా నున్న దనగా: లోకమంతా ఒక ప్రవాహమువలె కొట్టుకొని పోవుచుండగా మనముకూడా ఆ ప్రవాహములో పడి కొట్టుకొని పోవు చున్నాము. ఈప్రవాహముతో మన వ్యక్తిత్వమును మరచి నాము. స్వయంవ్యక్తిత్వమును మరచినచో మనకు మోక్షములేదు. మన మోక్షముకొరకు మనము పాటుపడ వలయును. ఇంకొక రెవ్వరు మనకు తోడ్పడరు. మనమంచి చెడ్డలకు మనము బాధ్యులము. మన యభివృద్ధిని మనము సంపాదింపవలెను— (Man is the architect of his own fortune). కాబట్టి ప్రతివ్యక్తియు, వివేకానందస్వామి నుడివి నటుల, తన్నుగురించి తాను తెలిసికొన వలయును- ఎల్లప్పుడు తన ఆత్మపరిశోధన ఆత్మశుద్ధి జేసికొనుచుండవలయును. తనబలమును శక్తిని తాను గ్రహింపవలయును. హిరణ్యా క్షుడు ప్రహ్లాదునితో "లోకము లన్నియు జయించి నానుగాని నిన్ను జయింపలేకున్నాను కారణమేమి?" అని యడుగగా ప్రహ్లాదు "డిట్లు చెప్పినాడు: నీవు ఎన్నిలోకములు జయించినను నీలోనుండు కామ క్రోధ లోభ మోహ మద మత్సరంబు లనెడు శత్రువులను జయింపలేక పోయినావు.

వీటిని జయించినవారికి లోకములో శత్రువు లుండజాల రని నుడివినాడు. కాబట్టి మనలోనుండు శత్రువులను మనము జయించినచో లోకములన్నియు జయించినవార మగుదుము. ప్రతివ్యక్తియు తన జీవితమును ఈపద్ధతి ననుసరించి నడపుట అవసరము. తన్ను తాను జయించినవాడే సిద్ధపురుషుడు. తన్ను జయింపనేరని వానివలన నించుకైనను లోకోపకారము కాజాలదు. బుద్ధుడు, మహమ్మదు, ఏసుక్రీస్తు, రామకృష్ణ పరమహంస వీరందఱు తమ్ము తాము జయించి గొప్ప లోకోపకారులైరి.

---

## 5-వ అ ధ్యా య ము.

(త్రిలోకసంచారి నారదుడు మరల ఇట్లుపన్యసించు చున్నాడు.)



క్రిందటి యుపన్యాసములో వ్యక్తిప్రాముఖ్యమును గూర్చి చెప్పియుంటిని. ఈపర్యాయము వ్యక్తిలో ప్రాముఖ్యమయిన వాటిని గూర్చి యించుక చెప్పెదను. ప్రతివ్యక్తి యభివృద్ధికి తోడ్పడు సాధనములు మూడు. అవి : మనస్సు, వాక్కు, క్రియ. ఈ మూటిలో ముఖ్యమయినది మనస్సు. మనయొక్క జీవనమంతయు మన మనస్సుపై నాధారపడి యున్నది.

మనయొక్క మంచిచెడ్డలు, కష్టసుఖములు మన మనస్సుపై ఆధారపడి యున్నవి, మన జీవితమేగాక మన

శరీరమందలి సర్వాంగాభివృద్ధికిని మనస్సే మూలము. మనము మనస్సులో నెట్లు తలచుకొనిన మన జీవితము నట్లు పరిణమించును. సుఖదుఃఖము లనునవి మన మనస్సులోనే యుండును. “ తన సంతోషమె స్వర్గము తన దుఃఖమె నరక మండ్రు తథ్యము సుమతీ” యను దానియొక్క అర్థమిదియే. మనస్సులోని తలంపులే మన ముఖమునం బ్రతిబింబిత మగు చుండును. మనస్సు స్వచ్ఛముగాను, పవిత్రముగాను ఉండినచో ముఖవర్చస్సు గూడ నదే విధముగ నుండును. తలంపులు కుటిలముగాను, కలుషితముగాను ఉన్నచో ముఖముకూడ నటులనే యుండును. అనగా సర్వసాధారణ ముగా మనిషిముఖము చూచిన వెంటనే వాని వృత్తిని గ్రహింపవచ్చును. దీనికి కొన్ని మినహాయింపులు (Exceptions) ఉండవచ్చును. కాని మామూలుగా నూటికి 90 మంది విషయములో ఈ మినహాయింపు లుండవు. మనిషి ముఖమును బట్టి సాధారణముగా నతడు శాంతముగా నున్నదియు, కోపముగా నున్నదియు తెలిసికొన వచ్చును. అటులనే అతడు కపటియో, నిష్కపటియో కనుగొన వచ్చును.

ఖూనీలు, కుట్రలు, దొంగతనములు మొదలైన నేరములను చేయదలచినవారి ముఖములనుబట్టిగూడ వారి మనస్సులోని తలంపులు గ్రహింపవచ్చును. నిర్మలమైన

మనస్సుగలవారు ఎల్లప్పుడును పరమార్థచింత గలవారు. పరోపకారధురీణుల ముఖములయం దెంత తేజస్సుండునో గ్రహింప వచ్చును. అటులనే మన అవయవములు గూడ "పొట్టివానికి పుట్టెడు బుద్ధు" లను సామెత గలదు. అనగా వాని మనస్సు పొట్టి దన్నమాట. వాని యాలోచన లెపుడును కుటిలముగా నుండును. కొంత మంది ఆజాన బాహులుగా నందురు. అనగా అట్టివారి మనస్సులో అల్పోద్దేశ్యములు చిన్నతలంపులు ఉండవన్న మాట. చెప్పవచ్చిన దేమనగా: మనస్సే అన్నిటికిని మూలకారణము. శరీరము సంపూర్ణావయవాభివృద్ధి జెందవలయు ననిన, ముఖములో వర్చస్సు ఉండవలయు ననిన, మనస్సు ఎల్లప్పుడును నిర్మలముగా నుండవలెను. నీచభావములకు కుచ్చితపు బుద్ధులకు తావొసగ గూడదు. కొందఱి ముఖము చూచిన చో మిక్కిలి వికారముగను, యెన్నియో నేరములు చేసిన వానివలెను ఉండును. మఱికొందఱి ముఖములో బ్రహ్మ తేజస్సు తాండవ మాడుచుండును; దీనికంతకును కారణము మనస్సే. మనిషియొక్క శరీరమును వాని ముఖమునుబట్టియే గాక వాని చేతివ్రాతను బట్టిగూడ వాని చిత్తవృత్తిని తెలిసికొన వచ్చును.

మానవస్వభావమును తెలిసికొన గోరువారు ముఖ్యముగా నీ సంగతులను గమనించు టవసరము.

మానవస్వభావమున నిదియొక ముఖ్యమయిన ప్రకరణము. మొట్టమొదట శరీరావయవముల వలనను ముఖవర్చస్సు వలనను మన గుణములను మన తలపులను మనము సరిగ తెలిసికొన్నచో నితరుల ముఖములనుబట్టి వాటి గుణములను సులకనగా తెలిసికొన వచ్చును. ఎవరితోనైనను స్నేహము జేయుటకు పూర్వము పైని జెప్పబడిన సంగతులను గమనింప వలెను. ఇంచుక సూక్ష్మబుద్ధితో జాగ్రత్తగా వాని ముఖమును చూచినచో వాని మనస్సంతయు మనకు వ్యక్తము కాగలదు. ఈ మనస్సును స్వాధీనము జేసికొనుటలోనే మన తెలివి తేటలు కనబడును. ప్రతిమానవుడును చక్కగా మనస్సును నిగ్రహింప (Self Control) గలిగినచో ఇక దుఃఖ మనునదియే యుండదు. అంతయు ఆనందమయముగా నుండును. మనశ్శాంతికి మించిన పెన్నిధిలేదు—(Peace of mind is the highest treasure.) కష్టములు నష్టములు ఎన్ని ప్రాప్తించినను మనస్సును నిబ్బరము చేసికొన్నచో నిబ్బరము ఆనందముగను సంతోషముగను ఉండవచ్చును. ఈమనస్సంతోషమే శరీరమునకు ఆరోగ్యమును, బలము నొసగును. సంతోషమే సగముబల మను నార్యోక్తి మన మందఱమును వినియున్నాము. మనస్సు విచారములతోను, చింతలతోను నింపి ఎల్లప్పుడును వాటినిగూర్చియే ఆలోచించుచుండినచో ముఖమున వర్చస్సు క్షీణించుటయేగాక

శరీరమున రోగము బయలుదేరును. మనోవ్యాధికి మందు లేదు. కాబట్టి ప్రతివ్యక్తియు మొట్టమొదట తనమనస్సును మంచి తలంపులతో నింపి దుష్టమగు తలంపులకు తావియ్యక యెన్నికష్టములు సంప్రాప్తమయినను దైవమునందు నమ్మకము వీడక పరోపకారచింత కలిగియున్నచో వాని జీవితము శాంతముగా గడచిపోవును.



## 6-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదుడు ఇట్లుపన్యసించుచున్నాడు.)

గత ఉపన్యాసములో మనస్సునుగూర్చి చెప్పి యుంటిని. ఈ పర్యాయము వాక్కునుగూర్చి యించుక చెప్పెదను. మనిషియొక్క జీవితములో ప్రధానమైనది వాక్కు. అనగా మనము సామాన్యముగా మాట్లాడు మాటలు. ఈ లోకములో జరుగు నొక్కొక్క కృత్యమునకు ప్రతికృతి (Action and reaction) ఉండునని నాదృఢమైన నమ్మకము. ఆ కృత్యము ఎంత స్వల్పమైనను సరే, ప్రతిక్రియ లేకుండ నుండదు. అనగా మనము చేయు కార్యములకే గాక మన నడతకు, మాటకు, చిట్టచివరకు మనము గాలి నాఘ్రాణించు విధమునకుగూడ ప్రతీకార ముండును.

ప్రతికృత్యమునకు ప్రతికృతియున్నప్పుడు మనము మాట్లాడు మాటలకుగూడ తప్పక ప్రతికృతి యుండితీరును.

"నీవు నేను మాట్లాడునపుడు అదృశ్యములగు ఎన్నికోట్ల కీటకములు గాలిలో మరణించుచున్నవో మనకు తెలియదు" అని వివేకానందస్వామి నుడివియున్నాడు. జీవితమునకు వాక్కు ప్రధానమనుట స్పష్టమేకదా! మనము మాట్లాడు మాటలవలననే కలహములు, శత్రుత్వములు, మనస్పర్ధలు పెరుగుచుండును. లోకములో మనము దేనినైనను త్రిప్ప వచ్చునుగాని, ఆడినమాటను మాత్రము త్రిప్పుటకు వీలు లేదు. పోయిన ఆరోగ్యము మరల సంపాదింపవచ్చును. పోయిన యైశ్వర్యమును మరల సంపాదింపవచ్చును. కాని, మన నోటినుండి ఒక్కసారి బయటకు వచ్చినమాటను మాత్రము వెనుకకు మఱల్పలేము. అది శాశ్వతముగా మన లెక్కలో నుండవలసినదే. కాబట్టి ప్రతివ్యక్తియు మొట్టమొదట తాను మాట్లాడు మాటయందలి విలువను గ్రహింపవలెను. దానిని గ్రహించిన పిదప తనమాటలను జాగ్రత్తగా వాడవలెను. ఈజాగ్రత్తంతయుగూడ మనము ముందుగనే తీసికొనవలెను. అనాలోచితముగ దేనినో ఒకముక్కను అనివేసి తరువాత దాని నుపసంహరించుకొనుటకు గాని, లేక దాని కొఱకు పశ్చాత్తాపపడుటగాని, తన తెలివిహీనతకు తన్ను తాను నిందించుకొని నందువలనగాని యించుకైనను లాభము లేదు. కాబట్టి ప్రతివ్యక్తియు త్రాసుతో తూచినట్లుగ మాట్లాడవలయును. నోరు మంచిదైన యూరు మంచిదగు నను సామెతను మనము వినియున్నాము. అనగా మనము

అనవసరముగా నెవరిని నిందింపకుండ, ఒకరిమనస్సు నొప్పింపకుండ, ఎవరికి అపకారము జేయకుండ మాట్లాడనేర్చినచో మనకు శత్రువులుండరు. అటులగాక మనము అనవసరముగా వారి వీరి నిందించుచు మాట్లాడినచో మన కందఱు శత్రువులే సంప్రాప్తమగుదురు. కాబట్టి ప్రతిమనుజుఁడును మెలకువతో మాట్లాడుటకు ప్రయత్నింపవలెను. సాధారణముగా మనస్పర్ధ లెందుకు బుట్టుచుండును? ఒకరు మాటాడున దొకరు సరిగా అర్థము జేసికొనలేక పోవుటయేగాక దాని నపార్థము చేసికొనుటవలన. ఇదియే ప్రస్తుతము ప్రపంచ మంతయు వ్యాపించియున్న యశాంతికిని కలహములకును యుద్ధములకును కారణ మనఁదగును.

ప్రపంచములో ఒకరు చెప్పున దొకరు సరిగ అర్థము జేసికొన్నచో నింత యశాంతి యుండుట కవకాశము లేదు. కాబట్టి మనలో మనము మాట్లాడు మాటలకు అపోహము కలిగినపుడు అట్టి యపోహములను తొలగించి యిరువురును సరిగ నొకరి భావము నొకరు గ్రహింప ప్రయత్నింపవలెను. అటులగాక ఆ యపోహముల నటులనే నిలువ నిచ్చినచో నదియే గొప్ప కలహవృక్షమగును. అది పెరిగి పెద్దదైనపిదప దానినణచివేయుట దుస్తరము. కాబట్టి పుట్టిన వెంటనే దాని నణచివేయుట మంచిది.

ఈ సందర్భములో ముఖ్యముగా గ్రహింప వలసిన దేమనగా: ఎంతవిద్యావంతులైనను, ఎంత గొప్పనాయకు

"నీవు నేను మాట్లాడునపుడు అదృశ్యములగు ఎన్నికోట్ల కీటకములు గాలిలో మరణించుచున్నవో మనకు తెలియదు" అని వివేకానందస్వామి నుడివియున్నాడు. జీవితమునకు వాక్కు ప్రధానమనుట స్పష్టమేకదా! మనము మాట్లాడు మాటలవలననే కలహములు, శత్రుత్వములు, మనస్పర్ధలు పెరుగుచుండును. లోకములో మనము దేనినైనను త్రిప్పవచ్చునుగాని, ఆడినమాటను మాత్రము త్రిప్పుటకు వీలు లేదు. పోయిన ఆరోగ్యము మరల సంపాదింపవచ్చును. పోయిన యైశ్వర్యమును మరల సంపాదింపవచ్చును. కాని, మన నోటినుండి ఒక్కసారి బయటకు వచ్చినమాటను మాత్రము వెనుకకు మఱల్పలేము. అది శాశ్వతముగా మన లెక్కలో నుండవలసినదే. కాబట్టి ప్రతివ్యక్తియు మొట్టమొదట తాను మాట్లాడు మాటయందలి విలువను గ్రహింపవలెను. దానిని గ్రహించిన పిదప తనమాటలను జాగ్రత్తగా వాడవలెను. ఈజాగ్రత్తంతయుగూడ మనము ముందుగనే తీసికొనవలెను. అనాలోచితముగ దేనినో ఒకముక్కను అనివేసి తరువాత దాని నుపసంహరించుకొనుటకు గాని, లేక దాని కొఱకు పశ్చాత్తాపపడుటగాని, తన తెలివిహీనతకు తన్నుతాను నిందించుకొని నందువలనగాని యించుకైనను లాభములేదు. కాబట్టి ప్రతివ్యక్తియు త్రాసుతో తూచినట్లుగ మాట్లాడవలయును. నోరు మంచిదైన యూరు మంచిదగునను సామెతను మనము వినియున్నాము. అనగా మనము

వారిని నిందింతురు. ఇందువలన తాముచేయు మేలంతయు వ్యర్థమగును. దూషణలు మాత్రము కలకాలము నిలిచి పోవును. మఱియు కుటుంబములోనివారు తమ మేలువలన బొందవలసిన సుఖమునకు, సంతోషమునకు మారుగ నెల్లప్పుడు దుఃఖ మనుభవించు చుండెదరు. కాబట్టి మన మనస్సు నిర్మలముగాను మన కర్మలు మంచివిగాను ఉన్నందువలన లాభములేదు. వాటికి తోడు మన మాటలుగూడ ఈర్ష్యారహితములుగను అహంభావరహితములుగను ఉండవలెను. అనగా, పయోముఖవిషకుంభమువలె నుండమని గాదు. మనస్సులో విషము పెట్టుకొని, పైకి తీపిగా మాటలుచెప్పి లోలోన గోతులు త్రవ్వ మనిగాదు. పయోముఖవిషకుంభములు లోకములో నెక్కుడుకాలము పట్టుబడకుండ దాగఁజాలవు. కొంతమందికి మనస్సులో నేమాత్రము కల్మషముండదు. ఎవరికిని అపకారము దలంచు బుద్ధికూడనుండదు. కాని, వారిమాటలు మాత్రము బహు కటువులుగా నుండును. అందుచే వారెంత మేలుచేసినను నిష్ఫలములే. ఒక గిన్నెడుపాలలో నొక విషబిందువువలె వారి మంచికార్యము లన్నియు విషమించిపోవును.

కాబట్టి అన్నిటికంటెను ముఖ్యమైనది మాట. అనగా మనసువలె మాటయు దీపిగా నుండవలయును. సత్యమును, ధర్మమును శాంతముగా వెలిబుచ్చుటకును, అహం

భావముతో వెలిబుచ్చుటకును చాల వ్యత్యాసముకలదు. ఆ సత్యమునే ప్రియముగా ప్రకటింపవలయును, కాని పరుష వాక్యములతో ప్రకటింపగూడదు.

మఱియు నింకొకవిషయ మేమనగా: ఏదైన నొక విషయమునుగూర్చి సత్యమును ప్రకటింపవలసి వచ్చినపుడు దానికి సంబంధించిన వ్యక్తుల నెన్నటికిని దూషింపగూడదు. మనము వ్యక్తిదూషణ ఉద్దేశ్యముగా బెట్టుకొన్నంతవరకు మనపని జయముకాదు. కాబట్టి స్వాభివృద్ధిగోరు ప్రతి వ్యక్తియు తాను మాట్లాడు మాటలను తూచి తూచి మాట్లాడు చుండవలయును. ఎవ్వరినిగాని ఎప్పుడును నిందగా మాట్లాడఁగూడదు.

ఇంకొక విషయము: కొందఱు మిత్రులు మనము కోరనిదే మన వ్యవహారములగూర్చి మనకు సలహానొసగు చుందురు. అట్లెన్నడును చేయఁగూడదు. అట్టిసలహాలలో నించుకైనను విలువయుండనేరదు. మనలను కోరినపుడే సలహా నొసగవలెను.

---

## 7-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదుడు తన యుపన్యాము నిట్లు సాగించుచున్నాడు).

కడచిన నా యుపన్యాసములో మాటవిలువను గూర్చియు, మనుజుఁ డాడవలయు మాట రీతినిఁ గూర్చియు

జెప్పి యుంటిని. లోకు లనేకవిధములుగ మాటాడు చుండెదరు. లోకానుభవము గలిగి జాగ్రతగా మెలఁగుదు మేని, ఇతరుల మాటలవలన మనము మోసపోవుట కవకాశ ముండదు. ఇతరుల మాటలవలన నష్టపడువారు, చెడిపోవు వారు లోకములో పెక్కుమంది గలరు. దీనికి కారణము: తమ అజ్ఞానము. మన మించుక తెలివితో ప్రవర్తించినచో ఇతరుల వలలో చిక్కుకొనము. ఒరులు చెప్పుమాటలు ఎంత వఱకు నిజమో, ఎంతవఱకు నమ్మదగినవో, మనము గుర్తింపఁగలిగి యుండవలెను.

సాధారణముగ లోకములో కొంతమంది ఏవిషయ మునుగూర్చి యైనను చులుకనగా వాగ్దానము చేసెదరు. అ దెంతపని ? ఇ దెంతపని ? ఫరవాలేదు. అట్లాగే చేస్తానని మన మడిగిన వెంటనే వాగ్దానము చేయుదురు. మఱికొందఱు దీర్ఘముగా నాలోచించిగాని వాగ్దానము చేయరు. చిట్టచివ రకు తమమాట నిలుపుకొని క్రియనెరవేర్చునది రెండవరకపు మనుష్యులు.

మొదటిరకపు మనుష్యులు: తమ మాటలకు విలువ తెలియకుండ మాటాడుదురు. వారికి లోపల తమమాటలను నెరవేర్ప వలయునను నిశ్చయబుద్ధి లేకపోయినను పైకి మాత్రము గంభీరముగా అప్పటి కప్పుడు నెరవేర్చు వారివలె మాటాడెదరు. వీరితో వ్యవహారము: ఇదిగో అంటె అఱు

నెలలు. ఇట్టివారు లోకములో నూటికి 99 మంది అని చెప్ప వచ్చును. కడకు ఒక్కరు.

రెండవరకపు మనుష్యులు: వీరు సర్వవిధముల నాలోచించి మాటయిత్తురు. ఒక్కపర్యాయము మాట యిచ్చినపిమ్మట లోకము తలక్రిందైనను దానిని వీడక నిలువ బెట్టుకొనుటకు ప్రయత్నింతురు. కాబట్టి ప్రతివ్యక్తియు నేదైన నొక విషయమునుగూర్చి జాగ్రత్తగా నాలోచించి మరి మాట యియ్యవలెను. వ్యక్తి గౌరవమంతయు మాట మీదనే ఆధారపడియున్నది. ఆమాటలో వ్యత్యాసము వచ్చినచో తన గౌరవమంతయు పోయినదని యెంచవలెను. గౌరవమును గోల్పోయినపిమ్మట ఇంక దేనికొరకు మనిషి జీవింపవలయునో తెలియదు.

మన మనస్సులో మంచి తలపు లుండినచాలదు. మన మాటలు మంచిగానున్నను చాలదు. ఈ రెంటికంటెను ముఖ్యమైనది క్రియ. అనగా: మనము చేయుపని. మనపనులను బట్టియే మనము పరీక్షింపబడుదుము. మనము చేయుపనుల బట్టియే మనము మంచివారమని, చెడ్డవారమని నిర్ణయింప బడెదము. ఈ మంచిచెడ్డ లనునవి వ్యక్తిభావములపై నాధారపడియున్నవి. కొందఱు చేయుపని కొంతమందికి లాభముగా నుండవచ్చును. మఱికొందఱకు నష్టము కలుగ వచ్చును. లోకములో ప్రతిపనివలనను లాభనష్టములు కలుగు

-చునేయుండును. ఈ పనులు చేయునపుడు ముఖ్యముగా గమ
నింపవలసిన విషయమొకటి గలదు. అదేదన: మనమేదైన
పని తలపెట్టినపుడు అధికసంఖ్యాకుల లాభమును మనమునం
దిడుకొనవలెను. మన పనివలన ఒకరిద్దఱికి నష్టము కలిగినను
వేలకొలది ప్రజలకు లాభము కలుగునని తోచునప్పుడు
ఒకరిద్దఱి నష్టమును పాటింపవలయునా? లేక, వేలకొలది
ప్రజలక్షేమమును లాభమును జూడవలయునా?.

ఇంకొకవిషయ మేమనగా: లోకములో మనమేమంచి
పని చేసినను మన విధ్యుక్తధర్మమును మాత్రమే నెరవేర్చు
చున్నామని తలపవలెను. బలవంతులు దుర్బలులకును,
విద్యావంతులు విద్యావిహీనులకును, ధనికులు దరిద్రులకును
సహాయమొనర్చుటలో తమ విధ్యుక్తధర్మమును నెరవేర్చిన
వారగుదురు. అట్లు చేయనినాడు తమవిధ్యుక్తమును
ఉపేక్షించిన వారగుదురు. పరులకు సహాయము చేయుట
యనునది చాల గొప్పసంగతియని కొందఱనుకొందురు. అది
గొప్పసంగతియని యెంచుటకుమారుగనట్టి యవకాశ మొదవి
నందులకు తాము సంతసింపవలయును.

ఒక బిచ్చగానికి మనమొక పైసా యిచ్చినచో
గొప్ప ధర్మము చేసినామని గర్వింపగూడదు. మన ధర్మ
బుద్ధికి, ఔదార్యమునకు, నవకాశ మొసంగినందులకు
బిచ్చగానికి కృతజ్ఞులమై యుండవలెను. పరులకు సహాయము

చేయు నవకాశములు ప్రాప్తించి నప్పుడెల్లను వాటిని మనము విడువగూడదు. అటువంటి యవకాశములు ఒక్కొక్క వ్యక్తి జీవితమందును మిక్కిలి యరుదుగా సంప్రాప్తమగు చుండును.

ప్రతివ్యక్తియు తన జీవితములో కొన్ని విధ్యుక్తములను నెరవేర్పవలసి యుండును. ఈ విధ్యుక్తధర్మములను నాలుగు భాగములుగా విభజించెదను; మొట్టమొదట మన తలిదండ్రులకు, తరువాత ఆలుబిడ్డలకు, పిమ్మట బంధు మిత్రులకు, అటుపిమ్మట దేశమునకు, ప్రతివ్యక్తియు తన జీవితములో ఈ నాలుగు విధములైన విధ్యుక్తములను నిర్వహింపవలెను. తాము పెద్దవారము, ప్రయోజకులము అయిన పిదప తమ తల్లిదండ్రుల ఆజ్ఞలకు విరుద్ధముగా ప్రవర్తించుటయే గాక వారిని పోషించుటకైనను నిరాకరింతురు కొందరు. ఈలాటివారి జన్మ తరింపజాలదు. మనలను పుట్టించి పెద్దవారిని జేసిన మన తలిదండ్రులయం దెన్ని లోపములున్నను వారిని దైవములవలె పూజించి వారిని గౌరవించుట మనధర్మము. పితృవాక్యపరిపాలనా విషయమున ప్రతివ్యక్తియు శ్రీరాముని దృష్టాంతభూతునిగా గైకొనవలెను. మనము ప్రయోజకులమైన పిదప మన తలిదండ్రుల నగౌరవపఱిచినా మనువిషయము మన జీవిత మున్నంతవఱకు మనలను బాధింపకుండ నుండదు. కాబట్టి ఇట్టి బాధ లేకుండ జేసికొనుట మంచిది.

ఇఁక ఆలుబిడ్డలయెడఁ దాము చేయఁదగిన విధి నపేక్షించి ఏదియో దేశోద్ధారకులమని, దేశోపకారులమని పెనగులాడుచుండెదరు. తమ కుటుంబము తిండిలేక కృశించిపోవుచున్నను లెక్క జేయరు. తన కుటుంబమును పోషింపలేని వ్యక్తి ఏమి దేశోపకార మొనర్పగలడు? ఇంటివా రొకమూల మల మల మాడిపోవుచుండగ తాను చేయు దేశోపకారమువలన ప్రయోజనమేమి? తన యాలు పిల్లల పోషణభాధ్యత సంఘముమీద వేసి తాను జేయు దేశోపకారమేమి?

"ఏవాని బంధుమిత్రులు
జీవధనంబులను దప్పి జెందును,-కృశునిం
గా వాని నెన్నఁగాఁదగు
కేవల తనుకార్శ్యయుతుఁడు కృశుఁడె నరేంద్రా."
—భారతము: శాంతి.

కాబట్టి ప్రతివ్యక్తియు మొట్టమొదట తనకుటుంబము నెడ తన విధ్యుక్తధర్మమును నెరవేర్చవలెను. దేశోపకార మనగా: తాను దేశమునకు నిజమైన యుపకారము జేయు స్థితిలో నుండవలెనుగాని దేశమునుండి, సంఘమునుండి యుపకారముపొందు స్థితిలో నుండగూడదు. ఇట్లుండుట ప్రతివ్యక్తికి సాధ్యముకాదు. కాని అయ్యది ప్రతివ్యక్తికి ఆదర్శప్రాయముగా నుండవలెనని నాయభిప్రాయము.

మొట్టమొదట తన బాధ్యతలను తన విధ్యుక్తములను గ్రహించి వాటిని నిరాకరింపక ధైర్యముతో నెరవేర్చుటకు ప్రయత్నించుట ధర్మము. "తన్నుమాలిన ధర్మము, మొదలుచెడ్డ బేరము" అను నార్యోక్తియొక్క అర్థమును గ్రహింపవలెను. మన తలిదండ్రులయెడ మన ఆలుబిడ్డలయెడ మన విధ్యుక్తములను పూర్తిగా నెరవేర్చినపిదప మన బంధుమిత్రులయెడలను దేశమునెడలను మన విధ్యుక్తములను నెరవేర్పవలెను.

కొంతమంది దేశము ముందు, వ్యక్తి తరువాత నందురు. కాని, వ్యక్తి ముందు, సర్వమును తరువాతనని ఎఱుంగవలెను. ఏలనన: మొట్టమొదట వ్యక్తి సరిగానుండినగదా దేశోపకారము మొదలైనవి జేయుట కవకాశము కలుగును. వ్యక్తియే లేనిచో, దేశమెక్కడ ? దేశోపకారమెక్కడ ? నేనిదివరకు సూచించినటుల ప్రతియభివృద్ధియు, ప్రతి సంస్కరణమును వ్యక్తినుండి బయలుదేరవలయును గాని బయటనుండిగాదు. కాబట్టి యీలోకములో మన మే దాన ధర్మములు జేసినను, యే లోకోపకారము చేసినను, మఱి యే సత్కార్యము లొనర్చినను, మన విధ్యుక్తము లొనర్చుచున్నామనియే యెంచుకొనవలయును. మనము చేయు పనులకు ప్రతిఫలమెప్పుడును కోరగూడదు. కాని ప్రతిచర్యకు

నేదియో నొక ప్రతిఫల ముండకపోదు. విధ్యుక్త ధర్మమును నెరవేర్చుటయే దానికిఁ బ్రతిఫలము.

---

## 8–వ అ ధ్యా య ము.

(త్రిలోక సంచారి నారదుడు మరల ఉపన్యసించుచున్నాడు.)

---

ప్రతివ్యక్తియు కొన్ని విధులను చేయవలసి యుండు నని జెప్పితిని. తనవిధులను సరిగ నిర్వహించినచో వానికి ఏ విచారమును, చింతయు నుండదు. ఈ సందర్భములో మన ముఖ్యసంగతిని గ్రహింపవలెను. ప్రతివ్యక్తియు తన యభివృద్ధికొరకుపాటుపడవలసిన మాట నిజమేగాని, వ్యక్తి జీవిత మంతయు స్వార్థముగా నుపయోగింపగూడదు. లోకములో రెండురకముల మనుష్యులుగలరు. ఒకరకము మనుష్యులు: కేవలము తమ ఆరోగ్యము, తమ ఐశ్వర్యమునే గోరుచు తమకొఱకే జీవించువారు. రెండవరకము: ఇతరుల ఆరోగ్యము, ఐశ్వర్యము నుండి తాము సంతోషింతురు. కొంత మందికి తమ తల్లిదండ్రులు, ఆలు బిడ్డలు, బంధుమిత్రులు ఎట్లున్నను సరే, తాము మాత్రము మంచి యాహారమును భుజించి, మంచి దుస్తులను ధరించిన జాలును. మరి కొంత మంది, "నాపొట్టకు నేనెంత తిన్నను ఏమిప్రయోజనము? నేను మంచిదుస్తులను ధరించిన ఏమిలాభము? నా తలి

అక్కఱపడవచ్చును. ఈ పట్టున ప్రతివాఁడును 'సింహము-చిట్టెలుక' కథను జ్ఞప్తియందిడుకొనవలెను.

మఱియొక విషయము: మనకు సమయమువచ్చినపుడు-ఈ లోకములో మనలను రక్షించున దేదియు లేదు. మన సుకృతవశమున దైవమే మనలను రక్షింపవలెను. అదనునకు ఆలుబిడ్డలు గూడ సాయము జేయజాలరు. కాబట్టి మన మెప్పుడును దేనికొరకును ఒరులమీద నాధారపడకూడదు. ఇతరులమీద నాధారపడుచున్నంత వరకు మనము బానిసలమే. బానిసలకు స్వాతంత్ర్య మెక్కడిది ? తనబువ్వ, తనబట్ట ఇతరులమీద నాధారపడకుండ, తాను స్వయముగా తయారు చేసికొనువాడే స్వతంత్రుడు. మన ఆరోగ్యము-కొరకు ఐశ్వర్యముకొరకు మనమే తంటాలు పడవలెను. మన కొరకెవరైనను పాటుపడెదరను మాట వట్టికల్ల. మనకు సమయము వచ్చినప్పు డెవరును సహాయము చేయరను నభిప్రాయముతో సాధ్యమయినంతవరకు ఇతరులమీద-యాధారపడక మన గతి మనము చూచుకొనవలెను.

ఇంకొకవిషయము : కొందఱు చెడ్డ పనుల దుష్ఫలిత-మంతయు కొన్ని మంచి పనులచే పరిహారమగునని తలతురు. అది గొప్ప పొరబాటు. మంచి పనుల ఫలితము ఒక్క చెడ్డపనితో బోవచ్చును. 'వేయి నోములఫల మొక్క

రంకుతో బోవు' నను సామెత గలదు. లోకములో మంచి పనుల ఫలితములకు, చెడ్డపనుల ఫలితమునకు సంబంధములేదు. వేటి ఫలితము వాటిదే. మంచి పనులకు బహుమానములు బొందుదుము. చెడ్డపనులకు దండింపఁబడుదుము. కాబట్టి ప్రతివ్యక్తియు సాధ్యమయినంతవరకు చెడ్డపనులను మానివేసి మంచి పనులను మాత్రమే జేయుచుండవలెను.

మరియొక విషయము: మనయెడల ఇతరులేవిధముగా నుండవలయునని మనము గోరుదుమో మన మితరులయెడ గూడ ఆవిధముగా నుండవలయు. అనగా: మన మితరుల కప కారము జేయుచు, ఇతరులు మన కపకారము జేసినపుడు మనము వారిని నిందింపగూడదు. ఇతరులకు ఒక నియతియు మనకొక నియతియు పెట్టుకొన్నంతవరకు మనకు పరస్పర వ్యాఘాతములును సంఘర్షణములును తప్పవు. సాధ్యమయి నంతవరకు ఇతరులకుపకారముచేయుటకు ప్రియత్నింపవలెను ఇతరుల కపకారము దలబెట్టువాడు తానే చెడిపోవును గా యితరుల నెన్నడును చెఱుపలేడు. మనము గొప్పవారమై మంచి ఉన్నత దశలోనున్నను, మిక్కిలి హీనదశలో నున్నను దానికి కారకులము మనమేగాని యితరు లెన్నటికినిగాజాలరు. అదృష్టము నెవ్వరునుతీసివేయలేరు. లేని దురదృష్టమును తెచ్చి పెట్టనూలేరు. మనఅదృష్టమునకు దురదృష్టమునకు మనమే కారకులము. ఉపకారముచేసినవారికి మరల మనముపకారము

జేయుట సామాన్యవిషయము. దానిలో అధికమేమియులేదు. మనకపకారము జేసినవారికి యుపకారము జేయుటయే గొప్పవిశేషము. "అపకారికి నుపకారము నెపమెన్నక జేయువాడు నేర్పరి సుమతీ" యని మనమందఱమును చిన్నప్పుడు చదువుకొనియున్నాము.

ఇంకొక విషయము: మనము జేయలేని పనిని ఇతరుల నెన్నడును జేయుండని చెప్పగూడదు. ప్రధానమైనది క్రియగాని వట్టిమాటగాదు. మాటలు చెప్పువారెక్కువ, క్రియలుజేయువారు తక్కువ. నేనొక్కడను దేశాభిమానము చేయకపోతేనేమి? మిగిలినవారు చేస్తే చాలదా? అని అనుకుంటాము. అట్లానే ప్రతివారు అనుకుంటారను సంగతి మనము మఱతుము. ఒక చిన్నకథ: ఒకరాజు తన ప్రజలందరిని ఒక్కొక్కరి నొక్కొక్క గిన్నెడు పాలొక బానలో పోయమన్నాటడ! ప్రతివారును అన్నిపాలలో నా ఒక్క గిన్నెడు నీళ్ళు కలసిపోవా అని తలచి ఒక్కొక్కడు ఒక్కొక్క గిన్నెడు నీళ్ళను ఆ బానలో పోసిరట! మరుసటి దినమున ఆ బాన పాలతో నుండుటకు మారుగ నీళ్ళతో నిండి యుండెను. అటులనే కొంతమంది తాము దేశాభిమానము చేయుటకు సిద్ధముగాలేక వాళ్ళెందుకు చేయగూడదు. వీళ్ళెందుకు చేయగూడదు అని యితరులను దూషించుచుందురు. నేనుమాత్రము నాయుద్యోగములోనుండి నెల

నెలకు జీతము సంపాదించుచుండవలెను. ఇతరులు మాత్రము తమ సర్వస్వమును దేశముకొరకు త్యాగము చేయవలయును. ఇం దేమైనను న్యాయముగలదా? ఇతరులు దేశారాధనము చేయు చున్నచో మన మానందింప వలయును. మనము చేయలేనందుకు చింతింప వలయును. అంతేగాని మనమోస్త రుగా దేశారాధనము చేయలేని వారిని మన మెన్నడును దూషింప కూడదు. మనము చేయలేని పనిని యితరులు చేయలేనిచో వారిని దూషించుటకన్నను నీచమైనపని యింకొకటిలేదు.

ఈ సందర్భములో యింకొక విషయము చెప్పవలసి యున్నది. అదేదనః కొంతమంది తాము మంచిగా లేకపోయినను యితరులను మాత్రము తమవలె చెడ్డగా యుండకుండ మంచిగా నుండమని బోధించెదరు. అంతవరకు వారట్లు బోధించుట మంచిదే. కాని, యీబోధనకును నేను పైన జెప్పిన విషయమునకును వ్యత్యాసమును కనిపెట్టవలెను. ఒక ఉదాహరణముః ఏదైన నొక దేశములో నొక మంచి యుద్యమము జరుగుచున్నదనుకొండి. ఆ యుద్యమములో నెంత మందియో ప్రవేశించి స్వార్థ త్యాగమును గావించు చున్నారనుకొందము. ఆ యుద్యమములో ప్రవేశించి దానిని జయప్రదము జేయుటకు మారుగ బయటనుండి కొంతమంది ఆయుద్యమము జయప్రదమగునా? చాలకాలము కొనసాగునా?

లేక నశించిపోవునాయను లేనిపోని ప్రశ్నలన్నియు వేయు చుందురు. మీదుమిక్కిలి వారెందుకు దీనిలో ప్రవేశింపరు? యని కూడ ప్రశ్నించు చుందురు. ఇంతకంటె హీనమైనపని మరియొక టుండదు. మనము చేయలేని పనిని యితరులను చేయమనుట కన్న నీచమింకొకటిలేదు. యింకొక విషయ మేమనగా: మనము యుద్యమములో పాల్గొని కష్టపడకయే ఉద్యమము ఫలవంతమైనపుడు దానిలో భాగమును సంపా దించుటకు మాత్రము సిద్ధమయ్యెదము. ఇది మరీ నీచము. తన డ్యూటీని తాను నిర్వహింపనివాడు ఫలమున కర్హుడు కాజాలడు.

---

## 9-వ అ ధ్యా య ము.

(త్రిలోకసంచారి నారదుం డిట్లుపన్యసించుచున్నాడు.

---

కడచిన యుపన్యాసములలో ప్రతిమానవుడు ఈ లోకములో కోరునది సౌఖ్యము, ఆనందము, సంతోషము అని చెప్పియుంటిని. ఎవరు ఏవిద్య నభ్యసించి ఏపని జేసినను, ఏమార్గమున ఏవిధముగ తంటాలుపడినను, ఆసౌఖ్యానందము సంపాదనకొరకేగాని వేఱుగాదు. సామాన్యముగా పురుషుడు సుఖ మనుభవించుటకు మూడుసంగతు లవసరము. అవేవన: ఆరోగ్యము, ఐశ్వర్యము, జ్ఞానము. 'Health, Wealth,

Wisdom. ఈ మూడింటిలో నేది కొరత్తైనను అది పురుషునకు దుఃఖ కారణము. ఈ మూడునుగల పురుషు లరుదుగా నుందురు. సృష్టివిధానములో ప్రతి మానవుని యందును నేదియో కొంత కొరత యున్నది. కొరతలేని పురుషులుగాని, సంపూర్ణ సుఖమనుభవించు పురుషులుగాని లోకములో తక్కువ. ప్రతిజీవియు నేదియో ఒకవిషయమును గూర్చి ఎల్లపుడును చింతిలుచుండును. పురుషులలో కొఱత యుండుట వలననే మనము లోకములో నూటికి 99 మంది దుఃఖ మనుభవించుట, నూటికి ఒక పురుషుడు మాత్రము సుఖ మనుభవించుట గాంచుచున్నాము. నూటి కొకరుగూడ సుఖ మనుభవించుచున్నారో లేదో యని సందేహావే వేయింట నొకరుగాని, లక్ష కొకరుగాని అట్టి సుఖులు వచ్చును. ఈదుఃఖమునకు గారణము మనలోనే యున్న సుఖ దుఃఖము లనునవి మన మనస్సులోనే యున్న లక్షలు గలిగిన ఐశ్వర్యవంతుడు నెల్లప్పుడు నేదియో 2 విషయమును గూర్చి చింతిలుచుండవచ్చును. చేతిలో కానిలేని గర్భదరిద్రుడు పరమసంతోష మనుభవింపవచ్చును. సుఖ దుఃఖములకు ముఖ్య కారణములు: సంతుష్టి లేక యసంతుష్టి (Contentment or discontent). మానవుడు మొట్టమొదట నేర్చుకొనవలసిన విషయ మేమనగా: ఈ లోకములో ఆశకు అంతము లే దనుసంగతి. దేవుడు మన కిచ్చినదానితో

సంతృప్తిపడి యుండవలెను. అనగా: ఎక్కువ ధనసంపాదనకు, ఎక్కువ గౌరవాతిశయములకు పురుషుడు ప్రయత్నింపకూడ దని గాదు దాని యర్థము. దేవుడు తన కిచ్చినదానితో సంతృప్తిపడుచు ఎక్కువదానికొరకు ప్రయత్నించుటలో తప్పేమియులేదు. అంతేగాని మనకు దేవు డెంతయిచ్చినను తృప్తిపడక, యితరుల కపకారము జేసినైనను మనము ఐశ్వర్యవంతులము కావలయు నని ప్రయత్నింప గూడదు. మనము హీనస్థితిలో నున్నపుడు మనకంటె నెక్కువ గొప్ప వారితో పోల్చుకొని మనల నంత హీన స్థితిలో నుంచినందుకు దేవుని నిందింపగూడదు. మనకంటె తక్కువ స్థితిగలవా రున్నా రనుసంగతి మన మెన్నడును మఱవక దేవుడు మనల నింతకంటె నెక్కువ హీనస్థితిలో నుంచకుండ ఈ స్థితిలో నుంచినందుకు మన మెల్లప్పుడు దేవునికి కృతజ్ఞులమై యుండవలెను. దేవుడు మనల నే స్థితిలో నుంచినను మనమాతనికి కృతజ్ఞులమై యుండవలెను. కాని, ఆతనిని దూషింప గూడదు. సాధారణముగ లోకములో యసంతుష్టికి మఱియొక కారణము గలదు. లోకములో పురుషునకు జీవితమునకు వలసిన వస్తువు లుండిన చాలదు. ఇతరులవలె తానుగూడ ఐశ్వర్యవంతుడను గాకపోతినే లేకపోయెనే యను చింత బాధించుచుండును. లోకములో విశేషమైన దుఃఖమునకు కారణము: తనకు లేకపోయెనే

యనికాదు, ఇతరుల కున్నదిగదా యని. కాబట్టి పురుషు డెప్పుడు ఇతరులఐశ్వర్యముచూచి చుప్పనాతితనము వహింపకూడదు. తన కున్నదానితో సంతృప్తిపడి యుండవలెను.

మఱియు మనము దరిద్రులముగా నున్నను, కష్టము లనుభవించు చున్నను మనోధైర్యము వీడగూడదు. లోకములో ధనవంతులు తక్కువ ; దరిద్రులెక్కువ. ఇంత మంది దరిద్రుల సృష్టించుటకు కారణము : దేవుడు వారిని ప్రేమించుటవలననే యని యొకకవీశ్వరుడు నుడివియున్నాడు.

"God created so many poor people because he loves them"

లోకములో దరిద్రులు, బీదవారును లేనిచో మన హృదయములు రాళ్ళవలె గట్టిగానుండును.

"If God has not created so many poor people our hearts will become as hard as stones"

మనము దరిద్రులముగా నున్నప్పుడే దైవచింత యధికముగా నుండును. భాగ్యవంతులు తమ భాగ్య మనుభవించుటలో దైవమునే మఱచిపోదురు. లోకములో దైవచింత గలవానికి ముక్తిమార్గమున్నది గాని, దైవమును మఱచిన వానికి ముక్తిలేదు. ఒంటె సూది బెజ్జములోనుండి పోవుట తేలికగాని ధనవంతుడు మోక్షము సంపాదింపలేడని ఏసుక్రీస్తు చెప్పియున్నాడు.

"It is easy for a camel to pass through the eye of a needle than for a rich man to enter the Kingdom of God."

కాబట్టి మనము బీదవారిని ధనహీనులను గౌరవింపవలెయును గాని నిరసింపగూడదు. కేవలము ధనము పురుషునకు మనశ్శాంతి నొసగ జాలదను సంగతిని మనము గుర్తింపవలయును. ధనము అనేక చింతలకు దుర్మార్గములకు మూలము.

"Money is the root of all evil" కాని ప్రస్తుత ప్రాపంచిక స్థితులనుబట్టి కేవలము ధనములేకుండ లోకములో జీవయాత్ర గడవదు. దానికొఱకు అవసరమైన ధనమును సంపాదించుట మన విధ్యుక్తధర్మమే. కాని లేనిపోని యాశలు కల్పించుకొని ఆయాశలు నెఱవేరమికి చింతింపగూడదు. న్యాయమార్గమున సంపాదించిన ధనమే యనుభవమునకు వచ్చును గాని అన్యాయముగాను, యితరులను హింసించిగాని సంపాదించిన ధనమెప్పటికిని యనుభవమునకు రాదు.

ఇంకొకవిషయ మేమనగా: పురుషుడు లోకములో జీవయాత్ర గడపునపుడు అనేక విధములైన యనుభవములను సంపాదించును. అనేకమంది మనల ననేకవిధముల మాయమాటలచే మోసపుచ్చుటకు ప్రయత్నించెదరు. లోకములో జరుగు మాయలు, మోసములు మనము తెలిసికొనుట

యవసరము. ఇతరులను వంచించుటకు గాదు; మనల నెవరును వంచింపకుండ గాపాడు కొనుటకై లోకములో వ్యవహరించునాతడు కేవలముఅజ్ఞానిగను, అమాయకుడుగను వర్తించుటకంటె మాయలు, మర్మములు తెలిసియున్నంత మాత్రమున నాతడు దుష్టుడు దుర్మార్గుడు యన వీలులేదు. ఆతడు పరమభాగవత శిఖామణిగ నుండవచ్చును.

---

## 10 వ అ ధ్యా య ము .

(త్రిలోక సంచారి నారదుడు ఇట్లు ఉపన్యసించు చున్నాడు.)

---

ప్రతివ్యక్తియు సంపాదించి యభ్యసింపవలసిన గుణములనుగూర్చి యుపన్యసింపుచు అందు నాయకులు ముఖ్యముగా గమనింపవలసినవిషయములగూర్చి నక్కడక్కడసందర్భానుసారముగ గతప్రసంగమున జెప్పియుంటిని. ఇప్పుడా విషయములగూర్చి యించుక విపులముగా జెప్పెదను. మొట్టమొదట నాయకు లనబడువారు, ఇంకను తమ విద్యాబలమువలన మహోన్నత్యమునకు జెందినవారు, ఇతరవిధమ గొప్పతనము సంపాదించినవారును అభ్యసింప వలసిన సౌజన్యము, వినయము, వినమ్రత. విద్యయొసగునువినయంబు అను భర్తృహరివాక్య ముండనేయున్నది. నిజమైన విద్యాధికులందును నాయకులందును వినయము ముఖ్యముగా గనబడు

-చునేయుండును. వీరు నిగర్వులుగను నిరాడంబరులుగను వర్తించెదరు. కావున వారి విద్యయు, నాయకత్వముగూడ రాణించును. 'అన్నీ ఉన్న ఆకు అణగిపడియుండును; ఏమీ లేని ఆకు ఎగిరెగిరి పడుచుండును' అను సామెత అందఱు ఎఱిగినదే. నేను పైనచెప్పిన నాయకులు మొదటిరకమునకు జెందినవారు. ఇంక రెండవరకపు నాయకులున్నారు. ఈరకపు నాయకులు విద్యావంతులయ్యు గర్వులుగానుందురు. వీరు సామాన్య ప్రజలను పశుప్రాయులవలె జూతురు. వీరికి ఎవరైనను నమస్కారము చేసినను మరల నమస్కారము చేయరు. ఎవరైన పలుకరించినను వినిపింపనట్లు నటింతురు. ఈ రకపు మనుష్యులలో అహంభావత్వము, గర్వము మెండుగా నుండుననుటవలన వారి నాయకత్వమునకు గొంత మచ్చ ఏర్పడుచున్నది.

కాబట్టి మొట్టమొదట నాయకు లనబడువారు గమనించి యభ్యసింపవలసినది వినయము. గొప్పతనమునకు ముఖ్యలక్షణము: అహంభావము గర్వము అని కొందఱు దలంతురు. ఇంతకన్నను గొప్ప పొరబాటు మఱియొక టుండజాలదు. వినయముగ నుండుటవలన తమ గొప్పతనమునకు లోటుకలుగునని మరికొంతమంది తలంతురు. అట్లెన్నటికినిగాదు. వినయముగా నుండుటవలన వారి గొప్పతనము హెచ్చునుగాని, తగ్గదు.

ఇంకొక విషయము: కొంతమంది ఒరులను లేమకంటె తక్కువవారినిగా పశుప్రాయులనుగా జూతురు. ఇటువంటి వారికి మరల లోకానుభవము తక్కువన్నమాట. మనము బి. ఏ. ఎమ్. ఏ ప్యాసు చేసినాముకదా యని అందఱికిని మనమోస్తరు తెలివితేటలు, విద్య యుండునా? ఎవరికి దగిన విద్య వారికుండును. ఎవరికి తగిన తెలివితేటలు వారికుండును. అందరికి బి. ఏ. ప్యాసైనవారి తెలివితేటలు కావలయునంటే యెట్లు వచ్చును? కూలిపనిచేసి జీవించు వానిని గాని, లేక ఇంక నితర తక్కువ పనులుచేయు వారినిగాని, మూర్ఖులని, పశువులని, దున్నపోతులని, గాడిదలని నిందించుటవలన ఏమిప్రయోజనము. వారుగూడ మనమోస్తరుగా బి. ఏ. ఎమ్. ఏ. ప్యాసైతే అటువంటి పనులు చేయకుండ మనమోస్తరుగా గొప్పపనులనే చేయుచుందురు. వారు విద్యావిహీనులు గనుకనే అటువంటిపని జేయుచున్నారు. అందరికిని గవర్నరుపని జేయుట శక్యమా? కోటివిద్యలు కూటికొఱకేర్పడినవి. ఎవరేపని జేసినను, యేవృత్తి నవలంబించినను అన్నియు వారివారి జీవనోపాధి కొఱకు గాని వేఱుగాదు. ఈవృత్తులలో హెచ్చుతగ్గు లెన్నుట న్యాయముగాదు. గొప్పపని మొదలు చిట్టచివరకు పాకీపనివరకు అన్నియు సమానములే. సంఘసేవకొఱకు, సంఘ సౌఖ్యముకొఱకు అన్నియు నవసరములే. కాబట్టి

సంఘములో గొప్పపని చేయువా డెంత గౌరవమున కర్హుడో పాకీపనిచేయువాడు నంతగౌరవమున కర్హుడు. సేవయొక్క గొప్పతనమును Dignity of labour మనము గుర్తించి నపుడే సంఘములో అందఱికి సమానగౌరవము మర్యాద ఏర్పడును.

మనలో నొకరినొకరు మనమే నీచముగా చూచినచో నితరులు మనలను నీచముగా చూచుటలో వింతయేమి? కాబట్టి సామాన్య వ్యక్తులసంగతి ఎట్లున్నను, నాయకు లనువారు తా మెవరినైతే నుద్ధరింప దలచిరో వారిని నీచముగా, ఈర్ష్యాభావముగా జూడ గూడదు. అందఱుగూడ పెద్ద పరీక్షలే ప్యాసయితే యింక మన నాయకత్వమే యుండదు; మన ముద్ధరింప వలసిన పురుషులే యుండరు. దేశములో నెక్కుడు మంది విద్యా విహీనులుగను పశు ప్రాయులుగను ఉన్నారు గనుకనే వారి నుద్ధరించుటకు దేశోద్ధారకులు, దేశనాయకులు మొదలైనవారు బయలుదేరినారు. అట్టి పశుప్రాయులను, విద్యావిహీనులను, విద్యా వంతులుగను జ్ఞానవంతులుగను పరిగణించుచున్నారు. కాబట్టి నాయకు లనబడువారు విద్యా విహీనలను విద్యావంతులుగను, పశుప్రాయులను మానవులు గను చేయుటకు ప్రయత్నింప వలయును. కాని, వారి నెల్లప్పుడును పశుప్రాయులని తెలివితక్కువ వారని దూషించి

నందువలన ఎంతమాత్రమును ప్రయోజనము లేదు. వారి నుద్ధరింపవలయుననిన వారియందు మనకు ఈర్ష్యాసూయలకు మారుగ గౌరవ ప్రేమ లేర్పడవలయును. ఈ గౌరవ ప్రేమ లేర్పడి నపుడే వారు క్రమముగా నుద్ధరింపబడుదురు.

ఈ నాయకుల సందర్భములోనే ప్రజాప్రతినిధుల గూర్చి యించుక జెప్పెదను. దేశాభ్యుదయమునకై ఏర్పడు కొన్ని కొన్ని సంస్థలకు ప్రజా ప్రతినిధుల నెన్నుకొను నాచారము గలదుగదా! వీటి కెన్నుకొనబడు ప్రతినిధులు గూడ నాయకులుగా బరిగణింప బడుచున్నారు. సాధారణముగా ప్రజాభివృద్ధి కొఱ కేర్పడు ఒకటి రెండు సంస్థల నుదాహరణముగా తీసికొందము. శాసనసభ, కార్పొరేషను సభ మొదలైనవిగలవు. ఈ రెండును దేశాభ్యుదయమున కేర్పడినవి. అనగా: వాటిలో ప్రవేశించు పురుషులు ప్రజా క్షేమముకొఱకు పాటుపడ వలసి యున్నది. ప్రజల కంటటికి ఎవరిమీఁద నమ్మకము గలదో వారి నా సభల ఎన్నికలకు యభ్యర్థిగా నుండు మని కోరవలెను. అట్టివా డభ్యర్థిగా నిలువఁబడినచో వారు చులకనగా నెన్నుకొన బడుదురు. ప్రస్తుతపరిస్థితులలో కొంతమంది ప్రజలు 'వద్దు మొఱ్ఱో'యని కేకలు వేయుచున్నను బలవంతముగా నెన్నికకు నిలువబడు చున్నారు. నిజముగా ప్రజలకు సేవచేయ దలచినవాడు ప్రజలు వారిని కోరిననే నిలువబడుదురు గాని లేనిచో నిలువ

బడరు. కాని ప్రజాసేవగాక ఆత్మసేవను గోరువారు ప్రజలు వద్దనుచున్నను బలవంతముగా నిలువబడుదురు. ఇట్టి ప్రజలకు సంబంధించిన విషయములో ప్రజాసేవ గోరక ఆత్మసేవ గోరువా రందఱు నిజమైన నాయకులును, ప్రజోద్ధారకులును గారు. అటువంటివారిని దేశద్రోహులని, స్వకార్యధురంధరు లని చెప్పిన తప్పులేదు. ఇంకా కొంతమంది నాయకుల లక్షణ మేమనగా: తమకు ప్రజోపకారము సేయుటకు శక్తిసామర్థ్యములు లేకపోయినను నిజమైన శక్తి సామర్థ్యములు గలవారి కడ్డు తగులుచుండెదరు. ఇట్లుచేయుట కడు నన్యాయము. మనము పబ్లికులోనికి రాకుండ చాటుననుండి ఏమిపని చేసినను మనల నడుగువా రుండరు. అట్టివారు లోకములో కోటానకోట్లు గలరు. వారిలో మన మొకరము. అప్పుడు మన మేమిచేసినను ఫరవాలేదు. మనల నడుగువా రుండరు. కాని ఆప్రజకు, సంఘమునకు సంబంధించిన పట్టున ఆప్రజయొక్కయు, సంఘముయొక్కయు ప్రతినిధిగా నున్నపుడు తన ప్రాతినిధ్యముయొక్క విధ్యుక్తధర్మమును సరిగ నెఱవేర్పవలయును. ఒక సభలో ఒక ప్రజాప్రతినిధి యెన్ని సంవత్సరములైనను సరే ప్రజలపక్షమున మాట్లాడకుండ మౌనముద్రతో గూర్చుండు ననుకొందము. అట్టి సభ్యుడు నిజముగా ప్రజాప్రతినిధిగ నుండదగిన వాడేనా? సూను మిక్కిలి ప్రజలపక్షమున పోరాడుచు తనయొక్క ప్రజాప్రాతినిధ్యధర్మమును క్రమముగ నిర్వర్తించుచున్న సభ్యుని

త్రోసివైచి వానిస్థానే తాను ప్రవేశించును. ఇట్టి బూటకపు నాయకులు ప్రజాప్రతినిధులు లోకములో ఎందఱో గలరు. చెప్పవచ్చిన దేమనగా: దేశసేవ చేయదలచినచో నొక సంస్థలో ప్రవేశింప వలయును. అంతియగాని, ప్రజాసేవ కేర్పడినసంస్థలను స్వలాభముకొఱ కుపయోగింపబడగూడదు. మనము మఱుగున నెట్టి స్వలాభము కొఱకు తంటాలుపడినను మనల నడుగు వా రుండరు. పబ్లికు సంస్థలను ప్రయివేటు లాభమున కుపయోగ పఱచినచో ప్రజల కుపకారమునకు మాఱుగ అపకారమే చేసినవార మగుదుము. మనకు ప్రజ కుపకారము చేయుటకు శక్తిలేనపుడు అపకారము చేయకుండ తటస్థముగ నూరకొనుట యుత్తమము.

---

## 11-వ అ ధ్యా య ము .

(త్రిలోక సంచారి నారదు డిట్లు ఉపన్యసించుచున్నాడు.)

కడచిన నాయుపన్యాసములో ప్రతిమనుజుడును దైవ సహాయము గోరవలయు ననియు, తన కెన్నికష్టములు వచ్చినను దైవముపై నమ్మకమును వీడకూడ దనియు చెప్పియున్నాను. మనము చేయు ప్రయత్నము లన్నియు సఫలత పొందవలయు ననిన, దైవసహాయ మావశ్యకము. అది లేక మనమెన్ని తంటాలుపడినను ప్రయోజనముండదు.

కేవలము దైవసహాయముపై నాధారపడి పురుషకారమును వీడకూడదు. "Heaven helps those that help themselves" స్వయంసహాయము జేసికొనువారికే దైవము తోడ్పడును. కాబట్టి దేనికైనను మొట్టమొదట స్వప్రయత్నము, స్వయంకృషి, అటుపిమ్మట దైవసహాయము ఆవశ్యకము. మనకు లోకములో వారివలన వీరివలన కలుగు లాభమంతకు కారణము దైవ మని నమ్మవలెను. వారు వీరు నిమిత్తమాత్రులు. దైవముచే ప్రేరేపింపబడి మనకు సహాయము చేయుచున్నారు. దైవప్రేరేపణము లేనిచో వారు మన కెంతసహాయము చేయ దలచినను దానివలన మన కించు కైనను లాభము కలుగదు.

ఒకచిన్న కథ :

ఒకఊరిలో ఇరువురు బ్రాహ్మణులు గలరు. వారు అనుదినము యాయవారముచే జీవించుచుండిరి. వారు ప్రతిదినము ఆయూరి రాజుదగ్గఱకు యాయవారమునకు వెళ్ళుచుండిరి. రాజు వారికి స్వయముగా బియ్య మొసగుచుండువాడు. రాజుదగ్గఱకు వెళ్ళినప్పుడెల్ల వారిలో ఒకడు "రాజసహాయం" అని, మఱియొకడు "దైవసహాయం" అని యాయవార మడుగుచుండెడివారు. ఇదే విధముగ ప్రతిదినము జరుగుచుండెడిది. రాజు మాత్రము రాజసహాయం అనుబ్రాహ్మణుని ప్రియముగాను, దైవసహాయం అను బ్రాహ్మణుని అప్రియముగాను జూచుచుండెడివాడు. రాజు

ఇటుల తలపోయుచుండెను: " ప్రతిదినము ధర్మము చేయు వాడను నేనైయుండఁగా ఆబ్రాహ్మణుడు దైవసహాయం అనుచుండుట ఏటిన్యాయము? రాజసహాయం అనేవాడు సరియైనవాఁడు. ఈ బ్రాహ్మణుని నేను ధనవంతుని జేసెదను. దైవసహాయ మనువానికి దైవమెంత తోడ్పడునో చూచెద గాక" యని యాలోచించి, రాజసహాయ మనుచుండు బ్రాహ్మణుని ధనవంతుని జేయుటకు ఒక చిన్నయుక్తి బన్నెను. రెండు పెద్దగుమ్మడి కాయలను దెప్పించి అందులో ఒక దానినిండ వరహాలు పోయించి యుంచెను. మరుసటిదినమున ఇరువురు బ్రాహ్మణులు మామూలుగా యాయవారమునకు వచ్చిరి. రాజు సంతోషించి తా కొసగు బియ్యముతో గూడ వరహాలతో నింపిన గుమ్మడి కాయను రాజసహాయం అను బ్రాహ్మణునకు, ఉత్త గుమ్మిడికాయను దైవసహాయం అనువానికి ఇచ్చెను. వారిరువురును సంతోషముతో తమతమగృహముల కేగిరి. రాజసహాయం అను బ్రాహ్మణుడు వట్టిపీనాసి. ఈ విధముగా ఆలోచించెను: "ఇంతగుమ్మిడికాయ నే నేమిచేయను! దీని నెవరికైనా అమ్మినచో నేదియో కొంతసొమ్ము సంపాదింప వచ్చును" అని దానిని అమ్ముటకు ప్రయత్నించుచుండెను. దైవసహాయ మనుబ్రాహ్మణునకు పెక్కుమంది పిల్లలుగలరు. తనకు, తన భార్యకు అందఱకు గుమ్మడికాయకూర అనిన

చాలాయిష్టము. రాజు యిచ్చిన గుమ్మడికాయ చాలదు. ఇంకొకగుమ్మడికాయ కొనుటకు బజారుకు వెళ్లుచుండెను. ఇంతలో రాజసహాయం బ్రాహ్మణు డీతని నెదుర్కొని ఎక్కడికి వెళ్లుచున్నావని యడిగెను. రాజు ఇచ్చిన ఒక్క గుమ్మడికాయ తమకు జాలదని మఱియొకదానిని కొనబోవుచున్నానని రెండవవాడు తెలిపెను. నా గుమ్మడికాయ నమ్మెదను కొనెదవా? యని యాబ్రాహ్మణు డడిగెను. ఆతడు కొనుట కియ్యకొనెను. చిట్టచివరకు నాలుగణా లిచ్చి, రాజసహాయం బ్రాహ్మణునియొద్ద ఆగుమ్మడికాయ కొనెను. రాజసహాయం బ్రాహ్మణుడు తనకు నాలుగణాలు దొరకినందుకు పరమానందభరితుడయ్యెను. దైవసహాయం బ్రాహ్మణుడు ఇంటికివెళ్ళి గుమ్మడికాయను కోయగా దానినుండి వరహాలు క్రిందరాలెను. భార్యయు, తానును సంతసించి ఆ వరహాలతో హాయిగా నుండిరి. రాజు, తనచే వరహాల గుమ్మడికాయ దానముగొనిన బ్రాహ్మణుడు మిక్కిలి సంతసించి తన్ను ఎక్కువగా స్తోత్రము చేయు నని తలచుచుండెను. మరుసటిదినము యథాప్రకారముగ ఇరువురును యాయవారమునకు వచ్చిరి. రాజసహాయం బ్రాహ్మణుడు మామూలుగా యాయవారము గైకొని పోవుచుండెను. వరహాల ప్రశంసయే లేదు. రాజునకు సందేహాము గలిగి, ఏమయ్యా! నిన్న నే నిచ్చిన గుమ్మడికాయ ఏమిచేసినా వని

అడిగెను. కూరచేసుకొన్నానండి; చాలా బాగా ఉన్న దని మాత్రమే జెప్పెను. అప్పుడు బ్రాహ్మణు డబద్ధ మాడుచున్నా డని రాజు గ్రహించి, నిర్బంధించి యడుగగా తానిచ్చిన గుమ్మడికాయను ఆ రెండవ బ్రాహ్మణునకు నాలుగణాల కమ్మితి నని చెప్పెను. అప్పుడు రాజునకు జ్ఞానము గలిగి దైవసహాయం అనుదాని పరమార్థము బోధపడెను. రాజు ఇట్లనుకొనెను: రాజసహాయ మనువాడు నన్ను నమ్మినాడు. దైవసహాయ మనువాడు దైవమును నమ్మినాడు. ఈ రాజసహాయ మనువానిని నే నెంత ధనవంతునిగ జేయదలచినను నిష్ఫలమయినది. దైవసహాయ మును కోరువానికి దైవమే తోడ్పడినది. కాబట్టి రాజ సహాయముకంటె దైవసహాయమే గొప్పది.

ఈ చిన్న కథవలన దైవసహాయ తత్వము పూర్తిగా బోధపడగలదు. మనము సహాయము పొందునది మనుష్యుల ద్వారానైనను, ఆ సహాయమును ప్రేరేపించునది దైవమే గాని మరెవ్వరును గారు. మనము వారిమీద వీరిమీద నాధారపడకుండ కేవలము దైవమునే నమ్మి యుండినచో అదియే మనకు మార్గము కనబడుచును. భగవంతుని నమ్ముకొనినాముగదా యని స్వయంకృషి మానగూడదు. జయాపజయములయొక్క భారము భగవంతునిమీద బడవైచి మనము శక్తివంచనలేక స్వయంకృషి చేయు చుండవలెను.

———

## 12-వ అ ధ్యా య ము .

(త్రిలోకసంచారి నారదుడు ఇట్లుపన్యసించు చున్నాడు.)



గత యుపన్యాసము లన్నిటిలోను పురుషులనుగూర్చి చెప్పియుంటిని. ఈయుపన్యాసమున స్త్రీలనుగూర్చి యించుక చెప్ప దలతును. ఇంతవరకు పురుషులనుగూర్చి చెప్పిన సంగతు లన్నియు కొంచె మించు మించుగ స్త్రీలకు గూడ అన్వ యించును. ఈశ్వరసృష్టిలో మిక్కిలి అందమయిన వస్తువు లలో స్త్రీ యొకటి. స్త్రీ యొక్క మనస్సును గ్రహించుట కష్టము. లోకాభివృద్ధికి స్త్రీపురుషు లిరువురును అవసరము. ఈయిరువురు హోదాకు సమానులే. హెచ్చుతగ్గు లేమియు లేవు. మన హిందూకుటుంబములలో స్త్రీలు అస్వతంత్రలు గను, బానిసలుగను చూడబడు చుందురని తలచుట కన్నను గొప్ప పొరబాటు మఱొకటి యుండదు. బాల్యమున తల్లి దండ్రులచేతను, యౌవనమునందు భర్తచేతను, వృద్ధాప్యము నందు పుత్రుని చేతను రక్షింపబడు చుండుటవలన స్త్రీ అస్వతంత్రయని శాస్త్రమున్నను మన సనాతనహిందూస్త్రీలు తాము స్వతంత్రులమని భావించుచుండిరిగాని బానిసలమని ఎన్నడును తలపలేదు. బానిసతనమనే తలంపు వారి మనంబు లలో ఎన్నడును చొరలేదు. మన హిందూస్త్రీలు తొల్లిటి నుండియు నిజభర్తలను దైవములుగా భావించి పూజింప

వలయునని బోధ చేయబడిరి. మన కుటుంబములో స్త్రీ యే గృహలక్ష్మి; ఇంటికి పెద్ద; ఆమెయే ఒక దీపము; స్త్రీ లేని గృహము చీకటికొంప; "ఆడుదిలేని యిల్లు అడవి; మగవాడు లేనియిల్లు మఠము" అను సామెత ఊరకపుట్టదు. సర్వశుభ కార్యముల యందును, పండుగ పర్వము లందును ఆమెయే సర్వాధికారిణియై తన యిచ్ఛ వచ్చినట్లుగ ప్రవర్తించు చుండును. పురుషునకు డబ్బు సంపాదించుటదక్క ఇతరపని యేమియులేదు. సమస్త గృహనిర్వహణ బాధ్యత స్త్రీ యే వహించును. పెండ్లిండ్లు మొదలైన శుభాదిక కార్యములందు ఆడుదాని సలహా గైకొనకుండ మగవాడు వర్తింపజాలడు. సంసారమనునది రెండెడ్లబండి; ఆ రెండెడ్లు తిన్నగా నడుచు చుండిననే బండి సరిగా సాగును. అటులనే కుటుంబముకూడ భార్యాభర్త లిరువురు అనుకూలముగ నున్నగాని ఆకుటుంబ మునకు శాంతి దక్కదు. సంతోషముండదు. కుటుంబములో శాంతి నెలకొల్పు బాధ్యత స్త్రీపురుషు లిరువురమీద నున్నను ఎక్కుడు భాగము పురుషునిపై గలదు. సాధారణముగ స్త్రీపురుషుల మనస్సులు సరిగ కలియకపోవుట వలన కుటుంబమున అశాంతి కలుగుచుండును. పురుషుడు మొట్ట మొదట నేదే నొక కుటుంబమున నొక విధముగ పెరుగును. ఆ యా కుటుంబ సంప్రదాయములబట్టి కొన్ని కొన్ని యభ్యాసముల కలవడి వాని మనస్సొకదారి నుండును. అటులనే స్త్రీ కూడ మఱియొక కుటుంబములో ఆ యా

సంప్రదాయములబట్టి ఒక విధముగా పెరుగును. వీ రిరువురును సమావేశమైనపుడు అనేక విషయములలో నేకీభావముండదు. అభిప్రాయములు భేదింపవచ్చును. అలవాటు వేరుగా నుండవచ్చును. తలంపులును మరియొక విధముగా నుండవచ్చును. ఇన్ని విభేదములతో గూడుకొనిన రెండు వ్యక్తులు జీవితకాలమంతయు గడపవలసియున్నది. కాబట్టి మొట్టమొదటిలో నిరువుర మనస్సు లొకతీరున నుండవు. వారి యభిప్రాయము లేకీభవించి యిరువురిమనస్సు ఏకమగు వరకు కొంతకాలము పట్టును. ఇదియే కుటుంబములో మొట్టమొదటి సందిగ్ధావస్థ. ఈ సమయముననే పురుషుడు తన తెలివితేటలను జూపి యుపాయముగా ప్రవర్తింపవలెను. అనేక విషయములలో నిరువురకు సరియైన గ్రహింపులుండవు. ఇరువురకును అపోహము లధికముగా నుండును.

ఈయపోహలను జయింపగలిగినచో నిరువురి మనస్సులు ఒకటికాక తప్పదు. భార్యాభర్తల మనస్సులు ఏకముగా నెక్కడనుండునో ఆకుటుంబములో శాశ్వతమైన ఆనందము, సంతోషము, సౌఖ్యము, శాంతి యుండును. ఇవన్నియు లేకపోవుటకు కారణము: భార్యాభర్తలలో సరియైనగ్రహింపు లేకపోవుటయే.

మన హిందూస్త్రీలు అవిద్యావతు లని, ఎమ్ ఏ లు, బి. ఏ లు, ప్యాసైతేనేగాని చదువు వచ్చిన వారితో జతగా

రని పెక్కుమంది తలచుచుందురు. దీనికి కారణము: పాశ్చాత్యవ్యామోహము, ఆధునికనాగరకతయే యనదగును. మన హిందువులలో సర్వసాధారణముగ ప్రతియింట నొక ముసలమ్మ యుండనే యుండును. ఆమెకు చదవటము వ్రాయటము చేతకాదు. కాని ఆమెకు తెలిసినన్ని నీతులు, సామెతలు, రామాయణ- మహాభారతము లందలి కథలు ఎవరికిని తెలియవు. మన పండుగులకు, మన స్త్రీలనోములకు అంతులేదు. ఒక్కొక్క పండుగకు ఒక్కొక్క నోముకు సంబంధించిన నీతికథ ఏదియో ఒకటుండును. ఈ కథలనుబట్టి మనస్త్రీలు నేర్చుకొనదగిన జ్ఞానము, నీతి ఎంతయో యుండును. మన కుటుంబములలో నుండు చిన్నపిల్లలకు ఈ కథలను జెప్పుటదక్క వేరు పనిలేదు మన ముసలమ్మలకు. కాబట్టి మన పూర్వపుస్త్రీలు చదువుట వ్రాయుట తెలియనివారైనను విజ్ఞానముగల స్త్రీలు. ఇంక వైద్యమువిషయమాలోచించెదము. ఆమెయొక్క అనుభవమునుబట్టి, వయస్సునుబట్టి మన ముసలమ్మకు తెలిసినంత వైద్య మెవరికిని తెలియదు. ఒక ముసలమ్మ యింట్లో ఉన్నచో సామాన్యమైన రోగములకు డాక్టరుదగ్గరకు వెళ్ళనవసరములేదు. ఆమె మిరియాల కషాయము, శొంఠి, అల్లం, ధనియాలు, తులసి మొదలైన మామూలు వస్తువుల అనుపానములతో సామాన్యరోగములను చులకనగా కుదుర్చును. ఈవైద్యమును మన స్త్రీలుకూడ తప్పక మన ముసలమ్మల దగ్గర గ్రహించు

చుండుదురు. ఇంక కాన్పుల విషయములో మన ముసలమ్మకు తెలిసినంత శిశుఆరోగ్యము, వైద్యము ఎవరికి తెలియదు. ఏ నర్సు అవసరములేకుండ అంతయు ఆమెయే చక్కబెట్టు చుండును. ఇక పాకము విషయములోను శరీర వ్యాయామ విషయములోను వేఱుగ చెప్ప నవసరములేదు. మన స్త్రీలు ఉదయము మొదలు సాయంత్రము వరకు తమ గృహకృత్య ములను సరిగ నిర్వహించినచో సర్వవ్యాయామము దానిలోనే యున్నది. ఇప్పుడు బి. ఏ. గాని ఎమ్. ఏ. గాని ప్యాసైన స్త్రీని తీసికొనుడు. ఆమెకు మొట్టమొదట పండుగలు నోములు, వ్రతములు, నీతికథలు అసలే తెలియవు. సామా న్యముగా దగ్గు, పడిశము పడితే డాక్టరు; వంట అస చేతకాదు. ఎప్పుడు ఈజీచైరు. శరీరవ్యాయామమునకు టెన్నిసో, బాడ్మింటనో; ప్రసవించినపుడు నర్సు వలయును. మన పూర్వకాలపు విద్యకు ఇప్పటి విద్య ఎంత భేదమున్నదో యూహింపుడు. మనము పురుషుల పాశ్చాత్యవ్యామోహములో బడి విద్య నభ్యసించి చి చివరకు ఎందుకు పనికిరాకుండా పోయినాము. ఇటీవల బెంగుళూరులో బి. ఏ. ప్యాసైన యొక యువకుడు 5, సంవత్సరములు ప్రయత్నించినను యుద్యోగము దొరక నందువలన జీవితమును భరింపలేక విషము పుచ్చుకొని ఆత్మహత్య గావించు కొనెను. మన పురుషులలో అస

చదువుకొనినవారు నూటికి 7, 8 మందైనను, ఆ కొద్ది మందిలోనే నిరుద్యోగము ప్రబలి యున్నది. ఇక వారి దాస్యభావమును (Slave mentality) గూర్చి వేరుగా జెప్పనవసరము లేదు. మన పురుషులలో దాస్యభావము నిరుద్యోగము చాలక మన స్త్రీలుగూడ పాశ్చాత్యవ్యామోహములోపడి బానిసలుగా నుండవలయునా? నా యొక్క అభిప్రాయము స్త్రీలకు పెద్దచదువు లవసరములేదు. పాశ్చాత్య విద్య అసలే అవసరము లేదు. మన పురాతన విద్య వారికి చాలును. ప్రస్తుత పరిస్థితులను బట్టి ప్రతిస్త్రీకి చదువుట, వ్రాయుట నేర్పినచో ఆమెయే స్వయముగా గ్రంథములు చదువుకొని పాండిత్యమును సంపాదించును. మన పురాతన ధర్మములను, ఆ యాచారములను పూర్వపు మన విద్యను చంపివేసి వాటిస్థానే ఆధునికవిద్యను ప్రవేశపెట్టుట కన్నను నిష్ప్రయోజన మైనట్టియు, హానికర మైనట్టియు సంగతి మఱియొకటి లేదనవచ్చును.

---

## 13-వ అ ధ్యా య ము .

(త్రిలోకసంచారి నారదుడిట్లు ఉపన్యసించుచున్నాడు.)



గత యుపన్యాసములో మన సనాతన హిందూ స్త్రీలకు విశేషమైన విద్య యవసరము లేదనియు పాశ్చాత్య వ్యామోహములో చిక్కుకొనక పూర్వకాలపు విద్యను,

పూర్వకాలపు పద్ధతులను అనుసరింప వలయుననియు జెప్పియుంటిని. మన హిందూ కుటుంబములలో స్త్రీ ప్రధానస్థాన మాక్రమించు చున్నది. ఈశ్వర సృష్టిలో స్త్రీ నిర్వహింపవలసిన విధ్యుక్త ధర్మము పరమ పవిత్ర మైనది. స్త్రీ తనధర్మమును సరిగ నిర్వహింపలేనిచో ఆమెయొక్క జీవితమంతయు నిష్ప్రయోజన మని జెప్పక తప్పదు. ఆమె తనయొక్క కుటుంబధర్మమును నిర్వహించుట లోనే విశేషమగు జ్ఞానమును తెలివితేటలను సంపాదించు చున్నది. అనుభవములేక కేవలము పుస్తకమునందలి విద్య వలన యించుకేని లాభములేదు. పాశ్చాత్యవిద్యకును పాశ్చాత్య పద్ధతులకును మన సనాతన హిందూకుటుంబ ధర్మములకును ఎట్టి సంబంధములేదు. ఆవిద్య, ఆపద్ధతులు మన కుటుంబములకు సరిపడవు. పాశ్చాత్యవిద్యవలన లాభ మున్నను లేకపోయినను కేవలము ఉదరపోషణార్థ మైనను పురుషు లావిద్య నభ్యసింపవలసి వచ్చుచున్నది; స్త్రీల కట్టువంటి యవసర మించుకైనను కనబడదు. పాశ్చాత్య విద్య నభ్యసించు విషయమై స్త్రీపురుషులకు విశేషమైన వ్యత్యాసముగలదు. పురుషు లభ్యసించుచున్నారుగదా యని స్త్రీలుగూడ నభ్యసించుటకు మొదలిడుటకన్న వెఱ్ఱితనము మరియొకటి లేదు.

పాశ్చాత్యవిద్య నభ్యసించిన స్త్రీలుగల మన హిందూ కుటుంబములసంగతి యించుక యాలోచించెదము. ఆడపిల్లకు

10, 11 వ యేట వివాహమైనదనుకొందము. ఆమెభర్త బీద వాడగుటచే కళాశాలవిద్య నభ్యసింపలేక ఏ గుమాస్తాగానో యుద్యోగములో ప్రవేశించును; ఆతనిభార్య బి. ఏ, లేక ఎమ్. ఎ. ప్యాసవుతుంది; వీరిరువురును కుటుంబమును నడుప వలయును. భార్య విశేషమగు విద్య నభ్యసించుటవలన మొట్ట మొదటభర్తయెడ గౌరవముండదు. కుటుంబసంరక్షణభార మంతయు భర్తపై పడవేయును. ఆమె తనభర్తకంటె ఎక్కువ యుద్యోగములో ప్రవేశించి ఆతని కంటె ఎక్కువ ధనమును సంపాదించుచుండును. ఇటువంటి కుటుంబములో భార్యాభర్త లిరువురు సుఖముగా నుండజాలరని ప్రత్యేకముగ జెప్పనవసర ములేదు. ఇటువంటి అసౌఖ్యపు కుటుంబములెన్నియో గలవు. భార్యతో సమానముగ విద్య నభ్యసించిన భర్త యుండినదక్క తక్కువ విద్యను చదివినభర్తయైనచో ఆ కుటుంబములో భర్తకునరకముదక్క వేరులేదని జెప్పవచ్చును. భార్యాభర్తలిరువురు ఎమ్. ఏలు ప్యాసైనవారైతే ఆకుటుంబ గతి సనాతన హిందూకుటుంబము వలెగాక కేవలవ పాశ్చాత్యపద్ధతులతో నిండిన ఒక పాశ్చాత్యకుటుంబవ వలె నుండును. అనగా మనదేశపువస్తువులన్నను మన పురా తన పద్ధతులన్నను వారికి గిట్టవు. వారి దృష్టియంతయు పాశ్చాత్యపద్ధతులకే మరలు చుండును. వీనికి కొన్ని భిన్న ములుండవచ్చును. నేను చెప్పునది సామాన్యుల విషయమేగాని

భిన్నములగూర్చి గాదు. మన సనాతన హిందూస్త్రీలు : సీత, సావిత్రి, అనసూయ, అరుంధతి మొదలగు పురాతనస్త్రీల నాదర్శముగా గైకొని తమజీవితమును పరమపవిత్రముగా గడుపుచుండిరి. పాతివ్రత్యమే వారి జీవితమందలి ప్రధాన లక్షణము. అదియేవారికి సర్వాలంకార భూషితము. పతివ్రత యొక్క మొదటిలక్షణ మేమనగా: తన భర్తను దైవముగా జూచుటయే. తన భర్తయం దెన్ని లోపములున్నను వాటిని సరకుజేయక వానిని దైవముగా పూజించు చుండవలసినదే. మన వేదములు, పురాణములు, ఇతిహాసములు, నీతికథలు, రామాయణ మహాభారతములు యీ మహాసత్యమునే యుద్ఘోషించు చున్నవి. ఇదియే సత్యము గానిచో యీగ్రంథములందలి నీతియంతయు నిష్ప్రయోజన మన్నమాటే. పాశ్చాత్య విద్య మనస్త్రీల దృక్పథమును పూర్తిగా మార్చివేసి లేనిపోని క్రొత్త పోకడలుయూహాలు కలిగించుచున్నది. వాటి ఫలిత మేమనగా: మన నవనాగరిక స్త్రీలు తమ భర్తలను దైవముగా పూజించుటకు మారుగా వారిని బానిసలవలె జూచుచున్నారు. మన సనాతన హిందూధర్మశాస్త్ర ప్రకారము ప్రతి కార్యమునందును వ్రతమునందును పురుషున కాధిక్యత యొసంగబడినదని. స్త్రీకి దాసత్వస్థాన మొసగబడలేదు. ఇట్లు తలచుట కేవలము పొరబాటు. ఇంతకూ నేను జెప్పునదేమనగా:

పాశ్చాత్యవిద్య పాశ్చాత్యపద్ధతులు మనసనాతన హిందూ కుటుంబములకు సరిపడవు. వాటివలన మనకు హానికలుగును గాని లాభ మించుకైనను లేదు. స్త్రీయొక్క ముక్తిమార్గమున కించుకైనను తోడ్పడవు. అనగా స్త్రీలు విద్య నభ్యసింప కూడదని గాని, కేవలము అజ్ఞానాంధకారములో మునిగి యుండవలయునని గాని, నాయొక్క యభిప్రాయము గాదు. స్త్రీలు విద్య నభ్యసింపవలసినదే; జ్ఞానము సంపాదింప వలసినదే. వీటిని సంపాదించుటకు పాశ్చాత్యవిద్య ఎందుకు ? మనపురాణములు వేదాంతములు రామాయణ భారతములు లేవా? వీటికిదోడు పాశ్చాత్యవిద్యకూడ సంపాదింపవచ్చును. కాని వీటిని త్రోసివేసి కేవలము పాశ్చాత్యవిద్య నభ్యసించుట నాయుద్దేశ్యముకాదు.

పాశ్చాత్యవిద్య నభ్యసించి ఎమ్. ఏలు, బి. ఏలు ప్యాసైనను తమ పూర్వకాలపు సనాతనహిందూధర్మము లను విడనాడక భర్తలను దైవములవలె పూజించు కుటుంబములను నడపు స్త్రీలు గలరు. కాని వారి సంఖ్య మిక్కిలి తక్కువ. స్త్రీ ఎటువంటి విద్య నభ్యసించినను ఎంతటి విద్యనభ్యసించినను తనకుటుంబధర్మములను సరిగ నిర్వహించుచున్నయెడల నష్టములేదు. కాని యీ రెంటికిని సామాన్యముగా పొసగదు. పాశ్చాత్యవిద్యలో మనలను బానిసలఁజేయు గుణముగలదు. కాబట్టి మనస్త్రీలు దానిని సాధ్యమైనంతవరకు దగ్గఱకు రానివ్వకుండ నుండ వలయును. మనము నిశ్చయముగా మనసనాతనహిందూ

ధర్మములను సరిగ గ్రహించి వాటి ప్రకారము నడచు కొన్నచో మన కుటుంబములలో నున్నంత సౌఖ్యము ఆనందము మరియొకచోట నుండదు.

---

## 14-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదు డిట్లు తన యుపన్యాసమును కొనసాగించుచున్నాడు.)

గత యుపన్యాసములో స్త్రీలు, పాశ్చాత్యవ్యామోహములను గూర్చి చెప్పినాను. ఈ పర్యాయము పురుషులు పాశ్చాత్య వ్యామోహమును గూర్చి యించుక జెప్పెదను.

గత 10, 12 సంవత్సరముల పూర్వమువరకు మన పురుషులు పాశ్చాత్య వ్యామోహములోబడి తమ ఆత్మనే పూర్తిగా మరచిపోయి సంపూర్ణ బానిసతనమున మునిగి పోయిరి. వారిదృష్టియంతయు పాశ్చాత్యనాగరకతవైపునకు మరలుటవలన తమ పూర్వపు ఔన్నత్యము తమదేశము యొక్క ప్రాచీననాగరకత వారి కెంతమాత్రమును గోచరించుటలేదు. ఈమైకమువలన మనదేశమన్నను, మన నాగరకతయన్నను మనదేశమునకు సంబంధించినదేదైనను మనకు యీర్ష్యాభావమును కలుగజేయుచుండెను. ఒకానొకప్పుడు మన భారతమాత లోకమునకంతకు నాగరకతను వ్యాపింప జేసి సర్వశాస్త్రములకు జ్ఞానమునకు ఉనికిపట్టయినదను సంగతి మనము పూర్తిగా మరచినాము. మన వేదములు,

శాస్త్రములు, వేదాంతములు పురాణములు, సర్వమును వెనకవేసి మన జ్ఞానాభివృద్ధికొరకు పాశ్చాత్యదేశమున కెదురుచూచుచున్నాము. మనదేశములో మనకు వలసిన సర్వసామగ్రియు లభ్యమగుచున్నను పాశ్చాత్య వస్తువులపై యభిరుచి మెండుగానున్నది. చిట్టచివరకు మనకు వలసిన సామాన్యపు ఉప్పు మొదలైన వస్తువులుగూడ పాశ్చాత్య దేశమునుండి రావలసియుండెను. ఇంతకును మన బానిసతన మెంతవరకు వెళ్ళినదనగా మన మాతృభాషలో మాట్లాడుట, వ్రాయుట మనకు సిగ్గుగానున్నది. మన మాతృభాష మనకు రెండవభాష యయినది.

మన సంస్కృతమునకు మన సంస్కృత పండితులకు వేదపండితులకు ఆదరముగాని పోషణగాని యసలేలేదు. ఈ బానిసతనమునకు ముఖ్యమయిన కారణము పాశ్చాత్య విద్యయే. ఇన్ని సంవత్సరముల వరకు మనసంగతి మనము పూర్తిగా మరచిపోయి యింత యధోగతి పాలెట్లయినామా యని మనకే యాశ్చర్యము కలుగుచున్నది. గత 10, 12 సంవత్సరముల నుండియు భారతదేశము పాశ్చాత్యము వైపు తన దృష్టిని మానివేసి తిరిగి తనవైపు మరల్చు కొనుచున్నది. పాశ్చాత్యవిద్యవలన పాశ్చాత్యనాగరికత వలన యందలి దుష్టతలు, దుర్మార్గములు మన కలవడి నవిగాని వాటియందలి మంచి సంగతులు మన కలవడ లేదు. వీటి మూలమున మన వేషభాషలే గాక మన స్వరూపమే పూర్తిగా మారిపోయినది. మనము

పాశ్చాత్య వ్యామోహములో మునిగియున్నపుడు మన పూర్వికులపై యొక విధమయిన నిరసనాద్యసహ్యాభావములు కలుగుటయే గాక పాశ్చాత్యు లేది యొనర్చిన నదియే సరియైనదని తలంచునంత యజ్ఞానాంధకారములో మునిగి యున్నాము. దైవానుగ్రహమువలన తిరిగి మనయాత్మను మనము కనుగొనుటకు ప్రయత్నించుచున్నాము. ఇన్ని సంవత్సరములుగా 35 కోట్లమంది భారతీయుల శరీరనాళము లలో చిక్కుకొని జీర్ణమైయున్న యీపాశ్చాత్యవ్యామోహమువలన బానిసతన మొక్క దినములో పోదు. వ్యాధి సులభముగా వచ్చును, గాని ఆలస్యముగా పోవును. అటులనే యీ దీర్ఘవ్యాధి త్వరలో మనకు నిమ్మళించదు.

లోకములో అజ్ఞానముగ ప్రవర్తించుటకును జ్ఞానముగా ప్రవర్తించుటకును వ్యత్యాసముగలదు. అటులనే యీ పాశ్చాత్యవ్యామోహము మనలను దీర్ఘరోగమువలె చుట్ట వేసి మనలను బానిసలనుగా జేసినదను విజ్ఞానమును మనము పొందినచో ఇదివరకు సంభవించిన బానిసతనమును తొలగించుటకును ఇంకముందు బానిసలు గాకుండ నుండుటకును ప్రయత్నింతుము. ఈవిజ్ఞానమునే పొందని వారు ఇంకను రాను రాను మరింత బానిసలగుటకు అవకాశము గలదు. జ్ఞానమునకు అజ్ఞానమునకు భేదమిది. కాబట్టి యిప్పటికైనను మనము జ్ఞానముకలిగి ప్రవర్తించుట ఉత్తమము. ఈవిజ్ఞానము కలిగిన వారికి తమ దేశమున్నను

తమ దేశవస్తువులన్నను గౌరవము అభిమానము హెచ్చగును. ఇంతవరకు తా నీ వ్యామోహములో నిమగ్నులై నందుకు తనంతట తన కే సిగ్గుగా నుండును. కాబట్టి ఇప్పుడిప్పుడు మైకముచే మూసుకొనబడిన నేత్రములను మనవారు తెరచి తమ దేశముయొక్క సౌభాగ్యమును కొనియాడుచు నింత వరకు తమకు గలిగిన వ్యామోహమునకు చింతిలుచున్నారు. ఈ విషయమునుగూర్చి నేను విస్తరించి చెప్పనవసరములేదు. మన యాత్మ మనము తిరిగి కనుగొన్నచో మన జీవితము నందు నూతన ప్రకరణ మారంభమయి మనజీవితమే పూర్తిగా మార్పు జెందును. మొట్టమొదట యీవిజ్ఞానమును పొందు టవసరము. ఈ విజ్ఞానమును పొందినచో మనపూర్వ కాలపు పద్ధతులన్నియు సరియైనవనియు ఆధునికపద్ధతు లన్నియు మనకు తగినవి గావనియు విస్పష్టము కాగలదు. ఈదృక్పథముతో మనము లోకములో సంచరించుటవసరము.

## 15-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదుడు మరల నిట్లుపన్యసించుచున్నాడు.)



పాశ్చాత్యవ్యామోహమునుండి బయటపడిన పిదప మనపూర్వకాలపు పద్ధతులవైపు మన దృష్టిని మరల్పవలెను. అనేకసహస్రవత్సరములకు పూర్వము ఏర్పరుపబడిన మన ప్రాచీనహిందూమతధర్మములు, శాస్త్రములు అభ్యాస ములు అన్నియు సవ్యముగను, సమంజసముగను గనబడును.

మన హిందూకులపద్ధతి, ఆశ్రమములు ఆశ్రమధర్మములు, పరనాగరికతల సంపర్కము వలన మార్పు జెందినను, ఎన్నటికిని నశింపవు. మన సనాతనహిందూమతమంతయు వీటిమీదనే నాధారపడియున్నది. మన కులము నశించి నపుడు మన హిందూమతముగూడ నశించినట్లె. పాశ్చాత్య విద్య వలన గలిగిన పాశ్చాత్యదృక్పథముచే మన పద్ధతులే మన కర్థము లేనివానివలె గన్పట్టును. కాని మన ప్రాచీన పద్ధతులను మనము సరిగ గ్రహించినచో ఒక్కొక్క పద్ధతికి పూర్ణమైన కారణము గనబడును. కాబట్టి యీ ప్రాచీన పద్ధతుల పరమార్థము, ప్రయోజనము నెఱుఁగుట మన ప్రథమకర్తవ్యము. వాటి యర్థమును గ్రహించిన పిదప వాటిని సాధ్యమయినంతవర కవలంబించుటకు ప్రయత్నింప వలయును. పట్టణములలో నివసించు మన జీవనము ప్రకృతి విరుద్ధమైనది. మన పూర్వకాలపు గ్రామజీవనమునకును ఇప్పటి పట్టణవాసమునకును ఎంతయో వ్యత్యాసముగలదు. పట్టణములలో నున్నంత అనారోగ్యము అన్యాయము గ్రామమునందు గనబడదు. కాబట్టి మన గ్రామజీవనమును పునరుద్ధరింప జేయుటకు మనము ప్రయత్నింపవలెను. మన వివాహపద్ధతికి మించినపద్ధతి మఱియొకటిలేదు. మనప్రాచీన పద్ధతులన్నియు పరహితచింతతోడను, సమీచీనదృష్టి తోడను, ఉదారభావమునను నిర్లిప్తులచేఁ బ్రతిపాదింపఁ బడినవి. కాని అవి రానురాను ప్రజల యజ్ఞానమువలనను ఇతరకారణముల వలనను పెక్కు మార్పులకు లోనై

వికారము లయినవి. ఈచెడిపోయిన నేటిపద్ధతులను యథాపూర్వముగ సంస్కరించుట మన విధ్యుక్త ధర్మము. మన ప్రాచీన పద్ధతుల వంటివి ఏ మతము నందును గనబడవు. ప్రకృతిజనని మనకు వలయు వస్తువుల నన్నిటిని ప్రసాదించు చున్నది. వానివిలువను గ్రహింపఁజాలక మన మెల్లప్పుడును పరదేశములవైపు చూచుచుందుము. ఒక్క వైద్యముం గూర్చి యోజింపుడు. మన యిండ్లలో సామాన్యముగా పెరుగు తులసి, గుంటగలగరాకు మొదలైనవాని విలువను గ్రహించినచో ఆసుపత్రికి, డాక్టరు దగ్గఱకు పరుగెత్త నవసరము లేకుండ రోగములను చాలవఱకు మనమే కుదుర్చుకొనగలము.

మన దేశములో ఆయాకాలములందు లభ్యమగు ఫలములు అనంతములు. కాలానుగుణమగు ఫలములను మనము భుజించుచున్నచో మన యారోగ్యమెంత చక్కగా నుండునో యూహింపుడు! గ్రామములలో ఆస్పత్రులు, డాక్టరులు అరుదుగా నుందురు. అనగా అక్కడ రోగములు తక్కువ. ఆస్పత్రులు, డాక్టరులు హెచ్చుగా నుండినచోట రోగము లధికముగా నున్నవని యర్థము. ఈ విధముగా ఆ సమస్తవిషయములగూర్చి జెప్పవచ్చును.

మనము పాశ్చాత్య వ్యామోహప్రవాహములో బడి కొట్టుకొనిపోక యిప్పటికైనను మన ప్రాచీనపద్ధతులవైపు మనదృష్టిని మరల్చి ప్రవర్తింపవలెను. ఖండాంతర పద్ధతులు

మనకును ప్రకృతికిని చాల దూరమును గలిగించినవి. అందువలన మనము ప్రకృతిసౌందర్యమునుగాని, తత్ప్రకృతిశక్తినిగాని పూర్తిగా గ్రహించుట కవకాశము లేకపోవుచున్నది. ధనసమార్జనాసక్తుల మగుటవలన దైవమునే మఱచినాము. ఇప్పు డిప్పుడు మన దేశీయులు ప్రాచీనపద్ధతులవైపు తమ చూపును నిగుడ్చుచున్నారు. ఈ పరిణతి శుభావహ మనందగును.

ఈ సందర్భమున హిందూకుటుంబములలో జరుగు విషమసంగతులను గొన్నింటిని, ఎల్లరెఱింగిన వేయైనను, స్మృతిపథమునకుఁ దేఁదలఁతును. సనాతనహిందూమతము పునరుద్ధరింపబడవలయు ననిన కొన్ని సంస్కరణములు మన కుటుంబములనుండి బయలుదేఱవలయును. మనకుటుంబములలో అత్త-కోడండ్రవాలకము లందఱెఱింగినవియే. తన కడుపాఱఁగన్న బిడ్డలనందఱ నొక్కతీరుగఁ గన్నతల్లియే చూడదు. అమ్మవాత్సల్యము, కొడుకులయెడ నొకమాదిరిగను, కూతుళ్లయెడ మఱొకరీతిగను కనఁబడును. కూఁతులను కూఁతులపిల్లలను జూచునంతకూర్మితో కొడుకులను వారిపిల్లలను జూచుట అరిది. తాను కొడుకుల పోషణమునుండియు, తనదను నదేదియయిననున్నచో దానిని కూతుళ్ళకే చెందింపఁ జూచుచుండును. ఒకే కుటుంబములో నివసించుచున్న కోడళ్లను కూతుళ్లను తల్లి వేర్వేరుగాఁ జూచును. అమ్మగాఁ గూతుళ్లను,అత్తగా కోడళ్లనుజూచును. మన కుటుంబములలో విభేదములు, కొట్లాటలు మొట్ట

మొదట స్త్రీలతో ప్రారంభమయి పురుషులదాక ప్రాకును. ఈకొట్లాటలకు కారణము చెప్పనాశితన మని వేఱుగ జెప్ప వలయునా? అత్త ఒకానొకప్పుడు తానుగూడ కోడలనను సంగతి మఱచును. అత్త, కోడలు ఇరువురు ఎల్లరకుమంచి వారైనను వా రిరువురకు పొందు కుదురదు. అత్త కోడలు అనుకూలముగా నున్న కుటుంబములు మిక్కిలి యరుదు. సామాన్యముగా ప్రతిహిందూకుటుంబము నందెల్ల అత్త-కోడండ్రపోరు పరిపాటియయినది. మన కుటుంబములలో అత్తలుచేయు పూజలకు, పురస్కారములకు, వారు విను హరికథలకు, పురాణములకు, వారు చేయు పుణ్యయాత్రలకు మితిలేదు. ఇన్నియుండియు, కాపురము నెడలను, కోడండ్ర యెడలను ఇంత విపరీతముగా వర్తించుట వింతగాదా! కాబట్టి మనకుటుంబములలో ఈవైపరీత్యమును నశింపజేసి ఎక్కువ ఔదార్యమును ప్రవేశపెట్టుటకు ప్రయత్నింపవలెను. మనకుటుంబములలో మన సొంతమనుష్యుల విషయములోనే మనమింత భేదముగా వర్తించుచుండగా అన్యజాతులు అన్య దేశస్థులు మనయెడల భేదవృత్తితో నడచుచున్నారనిన వింత ఏమి గలదు? మొట్టమొదట మన కుటుంబములు సంస్కరింపబడవలయును. మానవ ప్రకృతినిమార్చుట దుస్తర మనుట కాదనరాదు. కాని యీవిభేదములను అంత మొందించుట సంఘప్రభువులగు పీఠాధిపతులయు, సంస్కరణ పరాయణులయు ధర్మమని హెచ్చరించు చున్నాను. ఒక వైపున రామాయణ మహాభారతములను, భగవద్గీతలను

పఠించుచు, మఱియొక వైపున కూతురిని, కోడలిని భేద భావమునఁజూచు మన స్త్రీలగతి మార్చి మన సంసారములను స్వర్గములఁ జేయుదురో, నరకకూపములుగా నుంతురో బుద్ధిమంతులకు వదలుదును.

---

## 16 వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదు డీపర్యాయ మిట్లుపన్యసింపుచున్నాడు.)

మనసనాతనహిందూధర్మశాస్త్రానుగుణముగ నియమింపబడిన వివాహపద్ధతి ఉత్తమమైనది. అతిబాల్య వివాహములు, రజస్వలావివాహములు, వితంతూద్వాహములు ఈ పద్ధతికి విరుద్ధములు. సనాతనపద్ధతిప్రకారము వధూవరులకు యుక్త వయస్సు వచ్చినపుడు మాత్రమే వివాహము జరుప బడవలెను. అనగా బాలిక రజస్వల కాక పూర్వము 10,12 సంవత్సరముల మధ్యను, బాలునకు 20,25 సంవత్సరముల మధ్యను వివాహము జరుపవలెను. ఈ పద్ధతి నవలంబించినచో అతి బాల్య వివాహముల వలన గలుగు ననర్థములు చాలభాగము తగ్గిపోవును. వితంతువుల సంఖ్య హెచ్చుగుటకు కారణము అతిబాల్య వివాహములు. కాబట్టి యీ వివాహము లందఱచేతను తీవ్రముగా ఖండింపబడుట సహజము.

సనాతనహిందూధర్మములలో వివాహము మిక్కిలి పవిత్రమైనది. ఇందునగూర్చిపాశ్చాత్యుల దృక్పథమునకును,

మన దృక్పథమునకును వ్యత్యాసము గలదు. విదేశీయులు ప్రేమించినవారినిఁ బెండ్లాడుదురు. (They marry whom they love)·; మనము పెండ్లాడిన వారినిఁ బ్రేమింతుము (We love whom we marry) అను ఈరెండు పద్ధతులందు చెడుగులుగలవు. కాని ఈరెంటిలో మనపద్ధతిమేలు. ఈరెండు పద్ధతులలో తక్కువ చెడ్డదాని నేరుకొనవలెను (Choose the lesser evil of the two). వివాహములు దైవనిర్ణయము లని పలువురనమ్మకము (Matches are made in heaven). వివాహముతో పురుషునకు గృహస్థాశ్రమము ప్రారంభమగును. ఆశ్రమములన్నిటిలో గృహస్థాశ్రమము ముఖ్యమయినది. మన మీయాశ్రమములో నిర్వహించు ధర్మముల ననుసరించియే మనకు ముక్తియుఁ బ్రాప్తించును. జీవన్ముక్తికొఱకు తంటాలుపడు పురుషుడు ఏకపత్నీవ్రతుడుగా నుండవలెను. నిజముగా తన ప్రేమనంతను ఒక స్త్రీ యందు విని యోగించువాఁడు మఱియొకస్త్రీని ప్రేమింప నొల్లఁడు. నిజమైన గృహస్థుడు తన భార్యను పూర్తిగా ప్రేమించును. గృహస్థాశ్రమమునకు ఏకపత్నీ వ్రతము ప్రథమనియమము. ఏకపత్నీవ్రతుడు తనభార్య మరణించిన పిదప మఱియొక స్త్రీని వివాహమాడడు. అటులనే భర్తను సంపూర్ణముగా ప్రేమించినభార్య ఆతనిమరణానంతరమున మఱియొక పురుషుని వివాహమాడదు. ఇదియే మనసనాతన హిందూస్త్రీలయొక్క పాతివ్రత్యమహిమకు కారణము. పూర్వకాలమందు భర్త మరణించినంతనే యాతనితో నాతనిభార్యగూడ సహగమన

మొనరించెడిది. దీనినే సతి యందురు. ఆధునిక నాగరకత ప్రకారము ఇది క్రూరపద్ధతియని నిలిపివేయబడినది. కాని యిప్పటికిని అక్కడక్కడ సతీ జరుగుచునే యున్నది. ఈపద్ధతి క్రూరముగాఁ గనఁబడినను దానిభావము పవిత్రమయినది. ధర్మసమంచితమగు సత్యము దుస్సహముగాను, క్రూరముగాను దోఁచును. సతి పద్ధతి యంతమొందింప బడిన తరువాత మన దేశములో వితంతువులసంఖ్య హెచ్చయినది. దేశములో వేలకు వేలు వితంతువు లున్నను వారందఱును తమపాతివ్రత్యమును చెఱుపు కొనక మన పూర్వీకులచే నియమింపబడిన పూజలు, పురస్కారములు, పురాణశ్రవణములు, తీర్థయాత్రలు లోనగు వానితో గాలక్షేపము చేయుచుండుట సనాతనహిందూధర్మముయొక్క మహిమను జాటుచున్నది.

కాబట్టి ప్రస్తుతము జరుగు వివాహములలో అతి బాల్యవివాహముల కర్థములేదు. వానిని ధర్మశాస్త్ర మొప్పదు. వాటిని ఖండించి తీఱవలయును. రజస్వలా వివాహములనుగూడ నే నంగీకరింపను. అవి మన హిందూ పద్ధతులకు సరిపడవు. వాటివలన పెక్కులనర్థములు గలవు. యుక్తవయోవివాహములే అన్నివిధముల అనుకూలములైనవి. ఇఁక వితంతూవివాహములలో రెండురకములు గలవు. కొంతమంది బాలికలకు వివాహమైన వెంటనే వైధవ్యము సంప్రాప్తమగును. వారికి పురుషసంపర్క మెంతమాత్రము నుండదు. వారి పాతివ్రత్యమున కెట్టిభంగమును కలుగదు. ఇట్టి స్త్రీలకు తప్పక వివాహము చేయవలెను.

ఒక పర్యాయమైనను పురుషసంపర్కము గలిగిన వితంతువు లకు పునర్వివాహము ఒప్పదు. అటులనే పురుషులకుగూడ ఒక్కదినమైనను తనభార్యతో ననుభవింపని పురుషుడు ఆమె మరణానంతరమున మరల పునర్వివాహము జేసికొనవచ్చును. కాని ఒక్కదినమైనను యనుభవించిన పురుషుడు నిశ్చలమైన ఏకపత్నీవ్రతుడైనచో మరల మఱియొక స్త్రీని వివాహ మాడడు. ఈ పద్ధతి మిక్కిలి క్రూరముగాను ప్రస్తుత నాగరక పద్ధతులకు భావములకు విరుద్ధముగాను గన్పట్టవచ్చును. కాని వానియందలి ధర్మము హెచ్చయినది. ఏ దేశము ఈ పద్ధతి ననుసరించి, జీవితకాల మంతటిలోను పురుషుడు ఒక్క స్త్రీనే, స్త్రీ ఒక్కపురుషునే ప్రేమించి ఇరువురును గార్హస్థ్యవ్రతనియమము జరుపుదురేని సంఘము యొక్కయు జాతియొక్కయు నిర్మలత్వమును గాపాడిన వారగుదురు. అటులగాక పురుషుడు లోలుడై శయ్యా నియమము బాటింపక అత్యాచార మొనర్చునేని సంఘము కలుషిత మగును; వర్ణసంకరమునకును బాల్పడును. పురు షుడు ఏకపత్నీవ్రతుడుగను, స్త్రీ ఏకపతివ్రతగను ఉండుట పరమగణ్యము. మన దేశములో గొన్ని సంవత్సరముల క్రితము ప్రారంభమయిన వితంతూవివాహసంస్కర ణాందోళనతో నే నేకీభవింపను. ఈ యాందోళన ప్రారంభమయి సుమారు 50 సంవత్సరముల కంటె హెచ్చుగాలేదు. అంతకుపూర్వ మనేక సంవత్సరములనుండి మన హిందూవితంతువులు తమవితంతూధర్మములను

నిర్వహించుచు తమపాతివ్రత్యమును గాపాడుకొనిరి. అందు మూలముననే మన హిందూమత మింతవఱకును బ్రదికి యున్నది. హిందూమతము చెడిపోకుండ, హైందవజాతి వర్ణసంకరముగాకుండ కాపాడినది మన హిందూవితంతువు లనిజెప్పవచ్చును. అట్టి వితంతువులలో ఆధునిక భావములు ప్రవేశించుటవలన వారు నూతనమైన యాందోళన సలుపు చున్నారు. సనాతనధర్మప్రకారము గావింపబడిన వివాహము లెన్నియో సౌఖ్యావహముగానున్నవి. రజస్వలా వివాహము లెన్ని సౌఖ్యవంతములుగ నున్నవి? లెక్కజూచినచో తప్పక సనాతనధర్మవివాహములే ఉత్తమములుగఁ దోఁచును. వితంతూవివాహములలో భార్యాభర్తలకు ముఖ్యముగా నుండవలసిన ప్రేమయుండదు. నిజమయిన ప్రేమలేని వివాహములు నిష్ఫలములు; నిరుపయోగములు.

ఈసందర్భమున వరకట్నముల గూర్చి యించుక జెప్పెదను. వివాహము పవిత్రమైనదనియు, ప్రేమానుబంధము ప్రధానముగా గలదనియు జెప్పియుంటిని. ఇప్పు డటులగాక వివాహములలో ధనము ప్రధానస్థాన మలంకరించుచున్నది. పురుషుడు వివాహమాడుటకు స్త్రీని బేరమాడును. ఎక్కువ బేరము గిట్టినచోటనే పెండ్లాడును. ఇట్లు స్త్రీధనము కొఱకు నాసించు పురుషు డెంత యధమస్థితికి వచ్చినాడో యూహింపుడు.

"ఉత్తమం స్వార్జితం విత్తం; మధ్యమం పితురార్జితం; అధమం భ్రాతృవిత్తంచ; స్త్రీవిత్త మధమాధమం" అని

శాస్త్రముగలదు. ఈ అథమస్థితి పాశ్చాత్యవిద్య నభ్యసించినవారిలో హెచ్చుగాగలదు. పురుషులు పరీక్షలు ప్యాసైనకొలది కట్నముల నెక్కువగా గోరుచున్నారు. అనగా వారెన్నిడిగ్రీలు సంపాదించుచున్నారో యంత యధమస్థితిలోనికి వచ్చుచున్నా రన్నమాట! తా మభ్యసించిన విద్యను తమ తెలివి తేటలను ఈ విధముగా దుర్వినియోగపఱుచుట మిక్కిలి శోచనీయము. కొంతమంది ఎంత ఎక్కువ కట్నము పొందితే యంతగొప్ప యని తలచెదరు. ఇది కేవలము పొరబాటు. తన స్వశక్తి మీదగాక స్త్రీలధనముమీద నాధారపడి యభివృద్ధి జెందు వాడు కేవలము అధమాధముడు. ఆత్మగౌరవము లేనివాడు తాను కట్నము కోరుటచే తనకు ఇల్లాలు గాబోవు పిల్ల తల్లి దండ్రులకు సంఘమునకు జాతికి ఎంత హాని అపకారము జేయుచున్నాడో యూహింపలేకున్నాడు! ఈ కట్నములు ఎంతమంది బాలికల ఆత్మహత్యలకో కారణభూతములగు చున్నవి! ఈ కట్నములు సనాతనధర్మమునకు కేవలః విరుద్ధములు. పురుషులు అందులో ముఖ్యముగ పాశ్చాత్యఉన్నతవిద్య నభ్యసించి డిగ్రీలను పొందువారు ఇట్టి హేయమగు నభ్యాసము నంతమొందించి నూతన సంస్కరణకు గడంగవలయు గాని, తామే దీని పెంపొందించుటకు ప్రయత్నము చేయగూడదు. స్త్రీలసొమ్మును గైకొనుటతోడనే స్వశక్తిని నశింపజేసికొని బానిసతనమున ప్రవేశించుచున్నాడు. నిజమగు స్వతంత్రము గోరు పురుషులు

స్వశక్తిపై నాధారపడవలయును. స్త్రీలధనముపై నాధారపడుట నైచ్యము, నింద్యము, గర్హ్యము అని వేఱుగఁ జెప్పవలెనా?

---

## 17-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదు డిట్లుపన్యసించుచున్నాడు)

గత యుపన్యాసములో వివాహముల గూర్చియు, వరకట్నముల గూర్చియు చెప్పియుంటిని. సనాతనహిందూ శాస్త్రము ప్రకారము పురుషుని జీవన్ముక్తికి నాలుగు ఆశ్రమములు నియమింపబడినవి. అందు బహ్మచర్య గృహస్థ వాన ప్రస్థసన్యాసాశ్రమములు. జీవన్ముక్తిపొందదలచినవాడు ఈ నాలు గాశ్రమములగుండా వెడలవలయును. నాలుగాశ్రమములు నాలుగు తరగతు లన్నమాట. ఒక్కొక్క తరగతిలోను పురుషుడు ఒక్కొక్క శిక్షణము పొందును. గృహస్థాశ్రమములో ప్రవేశింపకుండ బ్రహ్మచర్యమునుండి సన్యాసాశ్రమమునకు ఎగురుటకు వీలులేదు. సన్యాసాశ్రమము గైకొనుటకు పూర్వము, పురుషుడు ఈ లోకమందలి సుఖము లన్నిటిని అనుభవించి మనస్సునందు ఏవిధమయిన కోరిక లేనివాడుగా నుండవలయును. ముఖ్యముగా పురుషుని మనస్సును చలింపజేయునది స్త్రీ. ఈ స్త్రీయొక్క సుఖమును పురుషుడు గృహస్థాశ్రమమునందు పూర్తిగా ననుభవింపవలెను. స్త్రీ సుఖము నెఱుగనివాడు బ్రహ్మచర్యమునుండి సన్యాసాశ్రమ

మును స్వీకరించినచో ఆయాశ్రమమున బద్ధుడై నియతిని గాపాడచూచిన తోడనే వాని మనస్సు చలించి పోవును. దేనిమీదైనను సంపూర్ణానుభవము మీదగాని విరక్తిపుట్టదు. సన్యాసాశ్రమమునకు సంపూర్ణ విరక్తి యవసరము. అభావ విరక్తిగాదు. గృహస్థాశ్రమమునకు సన్యాసాశ్రమమునకు మధ్యనుండు వానప్రస్థాశ్రమము పరీక్షాశ్రమము. అనగా గృహస్థాశ్రమములో పురుషుడు సంపాదించిన విరక్తి సన్యాసాశ్రమములో జేరుటకుపూర్వము నిలకడగానుండునా లేదా యని పరీక్షజేయుటకు ఏర్పడిన యాశ్రమము. ఈ ఆశ్రమములలో పురుషుడు స్త్రీతో గూడ కలసి మనస్సు చలింపకుండ నుండవలెను. ఈ యాశ్రమములో మనస్సు చలింపని పురుషుడు సన్యాసాశ్రమమున కర్హుడు. ఈ విధముగ బ్రహ్మచర్యము గృహస్థ వానప్రస్థసన్యాసాశ్రమములు పురుషుని శిక్షణకొ కవసరమైన తరగతులు. కొంతమంది బ్రహ్మచారుల గృహస్థాశ్రమమును స్వీకరింపకయే జీవన్ముక్తిని పొందెదమని తలతురు. ఇది గొప్ప పొరబాటు. ఆశ్రమము లన్నిటిలోను ముఖ్యమైనది గృహస్థాశ్రమ మని యిదివరకే జెప్పియుంటిని. ఈ ఆశ్రమమును సక్రమముగ స్వీకరింపనివారికి సగము లోకము మూయబడియుండును. లోకానుభవము లోకజ్ఞానము తక్కువగానుండును. లోకములో తెలిసికొనవలసిన సంగతు లను కొన్నింటిని బ్రహ్మచారులు తెలిసికొనలేరు. స్వానుభవ మునకును పుస్తకములను జదివి నేర్చుకొను జ్ఞానమునకును

వ్యత్యాస మధికముగాగలదు. ఏదైనను లోకములో స్వానుభవమునకు మించినది మరియొకటిలేదు. కొంతమంది బ్రహ్మచారులు గృహస్థులను నిరసింతురు. సంసారభారమునకు వెరచి వారు ఆయాశ్రమమును స్వీకరింప నిరాకరింతురు.

వివాహమాడుట మంచిదా కాదా యని సోక్రటిస్ అను గొప్పవేదాంతినిఁ బ్రశ్నింపగా ఏదిచేసినను విచారింతువని ప్రత్యుత్తరమిచ్చెను. ("Whichever you do you will repent") అనగా వివాహమాడినను విచారింతువు. వివాహమాడకపోయినను విచారింతువని యర్థము. కాని యీరెంటిలోను స్త్రీని ప్రేమింపకుండ కేవలము బ్రహ్మచారిగానుండుటకంటె ప్రేమించి ప్రేమను పోగొట్టుకొనుటయుత్తమము ("It is better to have loved and lost than not to have loved at all").

మనసంసార మొక సముద్రమునకు పోల్చబడినది. నిశ్చయముగా సంసారమును గడపుట సముద్రము నీదుటయే. కాని యీసముద్రము పెక్కుమంది బ్రహ్మచారులు తలచినటుల .కేవలము దుఃఖముతో గూడుకొనిన సముద్రము కాదు. ఇది సమానసుఖ-దుఃఖములతో గూడిన సముద్రము. సుఖ-దుఃఖములు రెండును లోకమున కవసరము. ఆధునిక పరిస్థితులనుబట్టి కొంతమంది బ్రహ్మచారులు గృహస్థులను నిరసించుట యాచారమైనది. ఈనిరసనభావమునకు కారణము కేవలము అజ్ఞానము.

మన గృహస్థాశ్రమము మనకుటుంబధర్మములు మిక్కిలి యుత్తమమైనవి. భార్యాభర్తలిరువురు తమతమ ధర్మములను సరిగ నిర్వహించినచో మనకుటుంబముల యందుండు నానందము, సుఖము మఱియొకచోట నుండజాలవు. ఇరువురకును పరమ పవిత్రములగు ధర్మములు విధింపబడినవి. వివాహకాలమున ఇరువురును అగ్నిసాక్షిగఁ జేసిన ప్రమాణ వచనముల ననుసరించి నడతురేని, ఆకుటుంబము దృష్టాంత భూతమై స్వర్గతుల్యముగ నుండును. లేక యిరువురలో ఎవరు తమధర్మములను నిర్వహించినను గూడ, ఆకుటుంబములో సుఖము కొఱఁతవడినను, శాంతము దక్కును. భార్యాభర్త లిరువురును తమధర్మముల నుల్లంఘింతురేని, ఆకుటుంబమున సంక్షోభము, అశాం ప్రబలును. పురుషుడు నిర్వహింపవలసిన ధర్మము లందఱ దెలియుటవలన వేరుగ జెప్ప నవసరము లేదు. సనాత హిందూకుటుంబములందలి స్త్రీలు నిర్వహింపవలసిన ధర్మ లీవిధముగా జెప్పబడినవి:

"కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, భోజ్యేషు మాతా, క్షమయా ధరిత్రీ, రూపేచ లక్ష్మీ శయనేతు వేశ్యా, షడ్ధర్మ యుక్తా కులధర్మపత్నీ"

గృహిణులు నిర్వహింప వలసిన ధర్మము లన్నియు నీ శ్లోకములో బొందుపఱుప బడినవి. ఇంతకంటెను గొప్ప నియమ గృహలక్ష్మల కుండజాలదు. పురుషుని ప్రవర్తన

ఏవిధముగ నున్నను స్త్రీ తన ధర్మమును నిర్వర్తించినచో ఆకుటుంబము శాంతినిక్షేప మనఁ బరఁగును.

బ్రహ్మచారులు సంసార మొకసాగరమని వెఱచి, దానిలో ప్రవేశింపకుండ నొడ్డున నిలుచుండి సముద్రములో బడి యీదుచుండెడు గృహస్థులను నిరసించు చుండిన లాభములేదు. ధైర్యముగా సముద్రము నీది ఆవలి యొడ్డునకు జేరినవాడే జీవన్ముక్తి కర్హుడు. సముద్రమునకు ఆవలియొడ్డు కనబడదు. దానిలో బడినవాడు ఏవైపునకైనను కొట్టుకొని పోవచ్చును; లేక దానిలో మునిగి పోవచ్చును. కాని పరమేశ్వరునిపై భారమువైచి సముద్రము నీదువాడు ఆవలి యొడ్డు సురక్షితముగా జేరగలడు.

మన శాస్త్రముల ప్రకారము పుత్రులులేని వారికి జీవన్ముక్తిలేదు. "అపుత్రస్య గతిర్నాస్తి" యనిశాస్త్రము. ఇక బ్రహ్మచారుల సంగతి వేఱుగ జెప్పనవసరములేదు. కాబట్టి పురుషుల జీవన్ముక్తికి పుత్రసంతాన మవసరము. దానిని బొందుటకు గృహస్థాశ్రమస్వీకార మవసరము.

ఆధునికపాశ్చాత్యభావముల బట్టి కొంతమంది పుత్రసంతానమును నిందించెదరు. జననము మరణము ఈశ్వరాధీనములు. అవి మన స్వాధీనములుగావు. పుత్ర సంతానము సంపాదించుటకుఁగాని, అరికట్టుటకుఁగాని మనకెట్టి యధికారమును లేదు. అది కేవలము ఈశ్వర సంకల్పము. ఈశ్వరుడు పురుషునకొసగు వరము లన్నిటిలోను

పుత్రసంతానము గొప్పది. హిందూస్త్రీలకు పుత్రసంతానమే సౌభాగ్యలక్షణము. స్త్రీ యెంతమంది పుత్రుల గనిన నంత సౌభాగ్యవంతురా లనిపించుకొనును. సంతతిలేని స్త్రీ గొడ్రా లనిపించుకొని సంఘముచేత నిరసింపబడును. సంతానముకొఱకు రాజులు, మహారాజులు, చక్రవర్తులు, లక్షాధికారులు తపస్సులు సల్పుచుండుట మనము కని విని యున్నాము. దరిద్రులకు పిల్ల లెక్కువ యను సామెతను గూడ వినియున్నాము. ఎక్కువమంది పిల్లలుగలవారు దరిద్రు లెన్నటికిని గాజాలరు. అంతకంటె ధనవంతులు మఱియొక రుండజాలరు. పుత్రధనముకంటె మించినధనము మఱియొకటిలేదు. లక్షలుగలిగిన లక్ష్మీపుత్రు డొక పుత్రుని కొఱ కేవిధముగ పరితపించుచున్నాడో గమనింపుడు! ఆతని లక్షలన్నియు నిరర్థకములుగా కనబడును. తనకు పుత్రసంతాన మొసగకుండ అంతఐశ్వర్య మొసంగినందులకు దైవమును నిందించుచుండును. దరిద్రుడు తనకు ధన మొసగకుండ అంతవిరివిగ సంతాన మొసగినందులకు దేవుని నిందించుచుండును. దరిద్రుడు దైవము తన కొసగిన పుత్రధనమును గ్రహింపకున్నాడు. వాళ్ళను పోషించుభారమును గూర్చియే చింతిలుచున్నాడు. ఈశ్వరుడు లోకములో ప్రాణిని సృష్టించినపుడే దాని పోషణకు గూడ ఏర్పాటు చేయుచున్నాడు. ఈసంగతి మనము గ్రహింపలేకున్నాము. పసిపిల్లవాడు జననమొందిన వెంటనే వానికి వలసిన పాల

కొఱకు వెదకుకొనకుండ తల్లికి స్తన్యము నేర్పాటుచేసెను. ఈశ్వరసృష్టి ఎంత చిత్రమైనది!

## 18-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదుడీపర్యాయ మిట్లుపన్యసించుచున్నాఁడు.)



పూర్వోపన్యాసమున పుత్రధనమునకు మించినధనము మఱియొకటి లేదని చెప్పియుంటిని. అధికపుత్రసంతానము గల గర్భదరిద్రులు తమ కీధన మొసగబడినందుకు దేవుని నిందించుటకు మాఱుగ ఆతనికి కృతజ్ఞులై యుండవలెను. వారి పోషణ విషయమై వా రెంతమాత్రము భయపడ నవసరములేదు. సృష్టించిన పరమేశ్వరుడు వారిని బోషింప లేకుండునా? "పుట్టించినవాఁడు పూరిమేపునా?" అను సామెత జ్ఞప్తి చేసికొనుఁడు. మన మెప్పుడును దైవమునెడ విశ్వాసము వీడక భార మంతయు ఆతనిపై వైచినచో ఆతడే మనభారము వహించును.

పుత్రసంతానములేని కుటుంబములు దీపములులేని కొంపలవలె చీకట్లు క్రమ్మియుండును. గృహస్థాశ్రమము నందలి భార్యాభర్తలలో జ్ఞానము లోకానుభవము అభివృద్ధి జెందుటకు సంతాన మవసరము. ప్రేమ లన్నిటిలోను మాతృవాత్సల్యము అనుపమానము, అనిర్వాచ్యము నైనది. అందుమూలముననే స్త్రీ ప్రసవమయినప్పుడెల్ల మృత్యుదేవత నెదుర్కొనుచుండును. స్త్రీ ప్రసవించుటనగా: పునర్జన్మ మన్న

మాట. మాతృ వాత్సల్య మింత యధికముగా లేనిచో లోకములో మన మందఱము ఎట్లు పెరిగియుందుమో చెప్పరాదు. సంతానములేని స్త్రీకి మాతృవాత్సల్యము కడుపుతీపి యననేమియో తెలియదు. సంతానముగల భార్యాభర్తలకు తమపిల్లలవలెనే ఇతరుల పిల్లలమీదగూడ ప్రేమయుండును. సంతానములేని భార్యాభర్తలు సాధారణముగా పిల్లలను జూచి ఏవగించుకొందురు. పసిపిల్లలపై ప్రేమ దివ్యగుణము లలో (Divine quality) ఒకటి. పిల్లలు 5 సంవత్సరములు వచ్చువఱకు దైవముతో సమానము. ఆవయస్సులో వారి కశుభము శుభము ఏదియు తెలియదు. సాధారణముగా గొప్ప గొప్ప వారందఱు పసిపిల్లలపై నధికమగు ప్రేమగల్గి వారితో ఆడుకొందురు. వారి హృదయముగూడ పసిపిల్లల హృదయమువలె నిర్మలముగా శాంతముగా నుండినగాని పిల్లలయెడ ఆకర్షణపుట్టదు. పిల్లలను పెంచుటలో మొదట 5 సంవత్సరములే మిక్కిలి కష్టము. వారిని పెంచునపుడు మనము క్రొత్తసంగతులను బెక్కింటిని తెలిసికొందుము. నూతనానుభవము పొందుదుము. సాధారణముగా పిల్లలు చిన్నతనములో అల్లరిచేసి తలిదండ్రులను విసిగింతురు. వా రెంతనెమ్మది వహించిననుజాలదు. అట్టి సమయమందు మనచిన్నతనములో మనతలిదండ్రులను మన మెంతవిసి గించితిమో వారిమనస్సెంత నొప్పించితిమో అని జ్ఞప్తికి తెచ్చుకొనవలెను. అది జ్ఞప్తితెచ్చుకొన్నచో మనపిల్లలయెడ మనము తప్పక సహనము వహింతుము.

బిడ్డలను 5 సంవత్సరములవఱకు దైవమువలెను, 10 సంవత్సరములవఱకు నౌకరువలెను, అటుపిమ్మట మిత్రునివలెను చూడవలయునని శాస్త్రము. కొంతమంది తలిదండ్రులు తమపుత్రులకాస్తిని సంపాదించిపెట్టుటకు ప్రయత్నింతురు. ఈయుద్దేశ్యము మంచిదైనను నే నేకీభవింపను. 'ఉత్తమం స్వార్జితం విత్తం' అని ఎవరికివారే స్వయంకృషివలన ప్రయోజకులు కావలయునని నామతము. మనపుత్రులు అప్రయోజకులైనచో కష్టపడి సంపాదించిన యాస్తి నంతయు మూడునిమిషములలో దుర్వినియోగము జేసెదరు. ఒకకుటుంబములో 5 గురు పుత్రులున్నచో వారితండ్రి వారికి 100 రూపాయిలఆస్తిని వదలిపెట్టినచో అది స్వల్పమయినను దానికొఱకందఱు పెనగులాడి కోర్టులకెక్కుదురు. వీటిమూలముననే కుటుంబములో అన్న-దమ్ములకు కలహాము పెరుగుచుండును. లోకములో మనము ఒక్క గొప్ప సత్యమును గ్రహింపవలయును. అదేదన: ఒకరి యదృష్టమునకు ఇంకొకరి యదృష్టమునకు సంబంధములేదు. ఒక్క తండ్రి కొడుకులైనను ఎవరి కర్మానుభవములు వారివి. రెంటికిని సంబంధములేదు. ఒకరిపై నొకరాధారపడవలయు నవసరములేదు. కాని మనము విధ్యుక్తధర్మములను నెఱవేర్చిన జాలును. పుత్రులవిషయములో 16 సంవత్సరముల వఱకు వారిని బోషించి ప్రయోజకులనుజేయు బాధ్యత మనది. అటుపిమ్మట వారిది. వారి కింత యాస్తిని సంపాదించి పెట్టవలయునని ఏశాస్త్రమందును లేదు.

లోకములో సాధారణముగా స్వయంకృషి వలన గొప్పవారైనవారిని పెక్కురను గాంచు చున్నాము. తల్లి దండ్రుల, తాత ముత్తాతల ఆస్తిని పొందినవారు ఊరు పేరు లేకుండ పోవుచున్నారు. మన మెంత లక్షాధికారులమైనను మనపుత్రులకు స్వయముగా పాటుపడి సంపాదించినగాని డబ్బు విలువ తెలియదు. డబ్బువిలువ తెలియనివారికి ఎంత ధనము చేతికి వచ్చినను వెంటనే దాని నేమిచేయవలయునో తెలియక దుర్వినియోగముచేసి తమజీవిత కాలములోనే దివాలా తీయుదరు.

ఇంక వివాహవిషయములో తనభార్యను పోషించుకొను సామర్థ్యము ఏర్పడినప్పుడే వివాహమాడవలయును గాని పోషింపలేనివాడు వివాహ మాడగూడదు. వివాహ మాడిన పిదప భార్యనుగూడ పోషింపలేని యప్రయోజకులుందురని తోచదు.

పిల్లలవిషయములో ఇంకొకసంగతి గమనింపవలెను. చిన్నతనమునఁ గొంతమందిపిల్లలు మంచి తెలివితేటలుగలి చురుకుగా నుందురు. మఱికొందఱు తెలివితక్కువగాః మాంద్యముగాను ఉందురు. చిన్నతనములో చురుకుగా నున్నవారు పెద్దతనములో మాంద్యముగా నుండుటయు, చిన్నతనములో మాంద్యముగా నున్నవారు పెద్దతనములో తెలివిగాను, చురుకుగాను ఉండుటయుఁ గలదు. అన్ని విషయములందువలె మనుష్యులలో తెలివితేటలు రాణింపవు. "అతి సర్వత్ర వర్జయేత్" అనుట అనుభవైకవేద్యము.

పండు పక్వముగా నున్నప్పుడు భుజించిననే రుచిగా నుండును. పంచదార తియ్యగా నుండునుగదా యని ఎక్కువగా వాడినచో నది విషమించును. అటులనే మనిషిలో తెలివి తేటలుగూడ మనస్సు పరిపక్వస్థితిలో నున్నప్పుడే తెలివి తేటలు రాణించును. మితితప్పిన తెలివి వికటకవిత్వమువలె విషమించును. కాబట్టి అతి తెలివితేటలు గనుపఱుప కుండునట్లు తమపిల్లలను తగిన కట్టుబాటులలో నుంచుట తలిదండ్రుల కర్తవ్యము.

---

## 19-వ అ ధ్యా య ము.

(త్రిలోక సంచారి నారదు డీపర్యాయ మిట్లుపన్యసించుచున్నాడు.)



ఈపర్యాయము పరమేశ్వరుని సృష్టివైచిత్ర్యమును గూర్చి చెప్పదలచితిని. పరమేశ్వరునిసృష్టి అతివిచిత్రమైనది; ఆద్యంతములులేనిది. మనము నివసించు లోకము లెన్నిగలవో చెప్పనేరము. 14 గని కొందఱందురు. కాని యీలోకములను లెక్కించినవా రెవ్వరును కనబడరు. ఈశ్వరసృష్టి బ్రహ్మాండమైనది. దానియొక్క పరిణామమును గనిపెట్టుటకు అల్పుల మగు మనకు తరమగునా ? నవగ్రహములయొక్కయు నక్షత్రమండలముయొక్కయు సృష్టివైచిత్ర్యము గాంచుడు. వేయేల! మనము నివసించు సామాన్యప్రపంచముయొక్క సృష్టివిభ్రమము గనుడు. మనము భూమిమీాద నివసించుచున్నాము. మనప్రపంచములో 3 వంతులు సముద్రము;

ఒకవంతుభూమి. భూమిమీదవలెనే సముద్రములో గూడ నివసించు జంతువులు గలవు. సముద్రము క్రిందను భూమి యుండి తీఱును. ఆభూమిమీదగూడ నివసించు జంతువు లుండితీరును. ఆకాశములో సంచరించు జంతువులు గలవు. ఈవిధముగా నీశ్వరసృష్టి ఇట్టిదని ఇంతదని నిర్ణయించుటకు వీలులేదు. కాని మన మీలోకములో నివసించునప్పుడు ఈశ్వరసృష్టివిలాసము గాంచుచు నివసింపవలయును. దేవుడు మనకు రెండునేత్రముల నొసగినందుకు వాటిని పూర్తిగా ప్రకృతివిలాసము గాంచుటకే వినియోగింపవలెను. ఈశ్వరుని గొప్పతనము ఆతని సృష్టియందలి ప్రతి స్వల్పవస్తువునందును గాననగును. అణువు మొదలు బ్రహ్మాండమువఱకు వ్యాపించియున్న యీమహా ప్రకృతిశక్తి యందలి ప్రతివస్తువు విచిత్రమైనది. కాని మనమీ ప్రపంచమున నివసించుట కెంత యలవడినా ఆసృష్టిలో సామాన్యమైన వస్తువులు మనల నాకర్షించుటలేదు. ఏదైన అసామాన్యము, అతివిచిత్రము జరిగినపుడే మన మాకర్షింపబడుదుము. అనగా సామాన్యముగా మనిషి తనకాళ్ళమీద నడచినపుడు మన కేమియు వింతగ గనబడదు. మనిషి కాళ్ళు పైకిబెట్టి తల క్రిందబెట్టి నడచినపుడు మనము వింతగా చూతుము. స్త్రీ ఒకపిల్లను గంటే వింతలేదు. ఇద్దర, ముగ్గుర గంటే వింత! శిశువు మామూలుగా పుట్టితే వింతలేదు. 3 కాళ్ళతోనో, 4 చేతులతోనో పుట్టితే వింత! ఇట్టివన్నియుగూడ ఈశ్వర సృష్టివైపరీత్యములు గాని, వింతలు గావు. ఈవిధముగా వైపరీత్యముల

వైపుననే మనదృష్టి ప్రసరించుటవలన సామాన్యసృష్టియొక్క విచిత్రమును మన మంతశ్రద్ధగా గాంచుటలేదు. సామాన్యసృష్టిలోనే మనము గాంచి నేర్చుకొనవలసిన దెంతయో గలదు. ఒకటిరెండు ఉదాహరణములు చెప్పెదను. కొబ్బరికాయలోనికి నీళ్ళు ఎట్లువచ్చును? పనసకాయకు పైన ముళ్ళు, లోపల తియ్యని తొనలు, అరటి చెట్టులో పువ్వు, కాయ, దూట, ఆకు, ఎట్లువచ్చుచున్నవో! ప్రతి పండునకు పైన తోలుపెట్టి చెడిపోకుండ ఏవిధముగా గాపాడుచున్నాడో? కూరగాయలు, ఆహారపదార్థము లన్నిటి సృష్టిని తిలకించినచో పరమేశ్వరుని మహిమ కనబడగలదు. వేయేల మనసంగతిచూడుడు.మనలో నెంత విపరీతమైన సృష్టిగలదో! కండ్లు చూచును, చెవులు వినును, కాళ్లు నడచును, చేతులు పనిచేయును, ముక్కు గాలి పీల్చును, నోరు తినును మాట్లాడును, నాలుక రుచుల గ్రహించును, ఉచ్చరించును. ఈవిధముగా ఇంద్రియాద్యవయవముల పనులలో నొకదానికి మఱొకదానికి సంబంధములేదు. కాని వాటిపనులు వేఱ్వేరైనను అవన్నియు ఒక వ్యక్తిలో నేవిధముగా ఒకటితో నొకటి పోట్లాడకుండ నెంత అనుకూలముగా తమతమ విధ్యుక్తములను నెఱవేర్చుచున్నవో చూడుడు! వ్యక్తియొక్క సంపూర్ణ జీవనమునకు అవన్నియు ఆవశ్యకములే. వాటిలో నేది తక్కువైనను వ్యక్తిజీవనమునకు కొఱత యేర్పడును. దీనినుండి మనము నేర్చుకొనవలసిన నీతియేమి? వ్యక్తిలోవలెనే లోకమునగూడ ఎవరి విధ్యుక్తములను వారు నిర్వ

హించుచు సుఖముగా నుండవలయును గాని ఒకరితో నొకరు పోట్లాడగూడదు. లోకజీవనమున కందఱు నావశ్యకమే. ఎవరులేకపోయినను కొఱత ఏర్పడును. అందుకని ఒకరి గొప్ప లేదు; మఱొకరి తక్కువలేదు. అందఱు సమానమనియు అందరు ముఖ్యమనియు గ్రహింప వలయును. ఇక మనలోనుండు యంత్రమునకు సమానమైన యంత్రము సృష్టియం దింతవఱకు అగపడదు. మనశాస్త్రజ్ఞులు ఎన్నెన్ని యంత్రములనో కనిపెట్టిరి గాని మానవ యంత్రమునకు సమానమైనయంత్రముగనిపెట్టలేదు. శాస్త్రజ్ఞులు తమశాస్త్ర ప్రావీణ్యముచే మనిషివంటి మనిషిని సృష్టింపగలరుగాని, బ్రహ్మాండము తలక్రిందైనను దానిలో జీవమును పోయలేరు. అది ఈశ్వరరహస్యము. ఈజీవమనేది ఎంత సున్నితమైనదో చూడుడు! మనము గాలిపీల్చినచో ప్రాణముగలదు. పీల్చక పోతేలేదు. మన జీవమంతయు దానిపై నాధారపడియున్నది. ఈవిధముగా ప్రకృతిలీలలను గాంచుటకు మనము గడంగ వలయును. మన క్షేమముకొఱకు మనశరీరమెంత యను కూలముగా సృష్టింపబడినదో గాంచుడు! మనశరీరములో ఆవశ్యకములయిన వన్నియుఁగలవు. తలమీద వెండ్రుకలు, వేళ్ళమీద గోళ్లు యెంత యుపయోగములో యెంత ఆవశ్య కములో చూడుడు! కాబట్టి యింత బ్రహ్మాండమగు సృష్టిలో అనవసరమైన దొక్కటియు నుండదు. మన యజ్ఞానమువలన గొన్ని యనవసరములని తలతుము. కాని యన్నియు నవస రములే. అవసరమైనవే సృష్టింపవలసిన వెన్నియో

యున్నపుడు అనవసరమైన వాటినిగూడ సృష్టించుటకు ఈశ్వరునకు వ్యవధిఎక్కడ? అయినను నిరర్థకమైనవాటిని సృష్టించుటకు ఈశ్వరు డంత తెలివిహీనుడా? మొట్టమొదట మనము లోకజ్ఞానమును సంపాదించుట అవసరము. వలనన: సర్వవేదాంత రహస్యము సృష్టినుండియే గ్రహింప బడినది. ఈశ్వరుడు తనయొక్క స్వరూపమును తన సృష్టిద్వారా లోకమునకు వెల్లడి జేయుచున్నపుడు, దానిని గ్రహించినచో ఆతని నిజస్వరూపము మనము గ్రహింప గలిగినపుడు, ఇంక ఆతనిని చూడవలయునని కోరిక ఎందుకు? అణువు మొదలు బ్రహ్మాండమువఱకు ప్రతి వస్తువునందును ఈశ్వరు డున్నాడని మన శాస్త్రములు ఘోషించుచున్నవి. కాని ఆత డెవరికిని గనపడడు. సామాన్య మనుష్యులవలె నాతడు కనబడుచున్నచో ఆతని మహిమ నెవరును లెక్కింపరు. సృష్టియంతయు నీశ్వరమయ మయినది. కాని యాతనికిని మనకును మధ్య మాయతెర గలదు. ఆమాయను తొలగించుట కెవ్వరికి సాధ్యము? ఈశ్వరునకు ప్రత్యేకస్వరూపము, నామములేదు. అన్ని స్వరూపములు, అన్ని నామములు ఆతనివే. ఇంత యఖండ సృష్టికర్తస్వరూపమును నిరూపించుటకు గాని, నిర్ణయించు టకు గాని, యూహించుటకు గాని మనిషిమాత్రునకు శక్యమా!

---

## 20-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదుడీపర్యాయ మిట్లుపన్యసించుచున్నాడు.)



కడచిన నా యుపన్యాసమున సృష్టి వైచిత్ర్యమును గూర్చి ఇంచుక చెప్పియుంటిని. సృష్టి వైచిత్ర్యమును ప్రతి పురుషుడు గ్రహించి యానందించుటకు బ్రయత్నింప వలయును గాని దానిని వర్ణించుట కెవరికిని సాధ్యపడదు. ఈ మహాసృష్టి కాద్యంతములు లేకపోయినను సృష్టికర్త మాత్ర ముండితీరును. ఈసృష్టికంతకు నొకడే కర్త. కర్త ఒక్కడేయున్నపుడు ఆసృష్టియందలి ప్రాణమున కంతకును అతనే మూలాధారమై యుండును. సమస్తకోటిజీవరాసులకు మూలపురుషు డాతడే. కాబట్టి ఆతని సృష్టిలో ఆతని దృష్టికి విభేద ముండజాలదు. ఆతనిసృష్టికి ప్రాణులన్నియు సమానమే. కాబట్టి మనము మొట్టమొదట గ్రహింప వలసిన దేమనగా: ప్రాణముయొక్క ఏకత్వము. జీవరాసు లనేకములైనను వాని యన్నిటియందు ప్రవహించు జీవ మొక్కటియే. మఱియు నీ సృష్టిలో నొకపద్ధతి, క్రమముగలవు. కాని ఏమియు లేకుండ అవకతవకగ నీ ప్రపంచము సృష్టింప బడలేదు. మఱియొక విషయ మేమనగా: ఈ ప్రపంచములో ఆతని యాజ్ఞ లేకుండ నేదియు జరుగదు. ఆతని యాజ్ఞ లేకుండ యొక చెట్టుయొక్క ఆకుకూడ కదలదు. ఆతనియాజ్ఞ ఎంతో అంతవరకే గాని ఒక్క నిమిష మెక్కువ గాలి పీల్చి

మన ప్రాణము నిలిపికొన జాలము. మన యజ్ఞానము వలన మన మెంతో ప్రజ్ఞావంతుల మని ప్రగల్భములు కొట్టు కొందుము. కాని లోకమున నడచునది ఆతని ఆజ్ఞ ప్రకారము గాని మన యాజ్ఞప్రకారముగాదు. దీని కొక్కటే నిదర్శ నము గలదు. సృష్ట్యాది నుండియు మానవుడు లోకములో ఎన్నిమార్పు లయినను జేయగలిగెను గాని సృష్టిని మాత్రము మార్పలేకపోయెను.

మఱియు సృష్టిని కూడా స్వాధీనము చేసికొనలేక పోయెను. మానవుడు లోకము లన్నిటిని జయింపవచ్చును గాని సృష్టిని జయింపనేరడు. తుపాను, భూకంపము, రోగము మొదలైన వాటిని నాపజాలడు. వాటి కెటువంటి బలవంతు డైనను లొంగవలసినదే. కాబట్టి మనుజుడు కేవలము ఈశ్వరుని యాటవస్తువు. అంతకంటె అధికమైన యధికార మతని కెంత మాత్రమును లేదు.

లోకమందలి సమానజీవత్వమును లోకమందలి జరుగు సంగతులన్నియు ఆతని యాజ్ఞ ప్రకారమే యనియు మనము గ్రహించినపుడు ప్రకృతిరహస్యము మనకు బోధపడగలదు. వస్తుతత్త్వమును బరిశీలించినచో ప్రకృతియందలి మంచి చెడ్డలకు రెంటికిని ఆతడే కారణభూతుడై యుండవలయును. కాని అటులగాదు. లోకములో వెలుతురు చీకటి యున్నవి గదా! మనమెప్పుడును వెలుతురు నాదరించి చీకటిని నిరసింతుము. మన జీవితమునకు ప్రధానమైనది వెలుతురు. చీకటి తాత్కాలిక మైనది. కాబట్టి వెలుతురు నిజము.

చీకటి అనిశ్చయము. అటులనే అజ్ఞానము జ్ఞానము, అధర్మము ధర్మము, అసత్యము సత్యము, ప్రేమ అసూయ మొదలైనవి. ఇం కొకవిషయ మేమనగా: అనిశ్చితమయిన వాటికి జీవము లేదు. నిశ్చయమైన వాటికి జీవముండకుండ నుండదు.

("The unreal hath no being the real never ceaseth to be")—

కాబట్టి ఈశ్వరుఁ డనగా నిశ్చయమైన శాశ్వత పదార్థము. అనగా జీవము, వెలుతురు, సత్యము, ధర్మము, ప్రేమ మొదలైనవి. ఒక ఉదాహరణము: మనిషి-అతనినీడ, మనిషి నిశ్చయము, నీడ అనిశ్చయము. కాని రెండును వెన్వెంటనే యుండును. అటులనే వెలుతురు చీకటి, జ్ఞానము అజ్ఞానము మొదలైనవి. ఇదంతయుకూడ వేదాంతమునకు సంబంధించిన విషయములు. ఈ సముద్రము లోనికి దిగితే లోతు ఎంతో కలదు. దానిలో మునగకుండ తేలటము కష్టము. ఆలోతులోనికి దిగమని నామతముగాదు. ఈ వేదాంత మెంతవఱ కవసరమో యంతవఱకు గ్రహింప వలయును. అప్పుడు గాని మనకు లోకములో జరుగు మంచి చెడ్డల యన్వయము సరిగా బోధపడదు. ప్రకృతిలోని మంచిచెడ్డ లకు రెంటికిని అర్థముగలదు. నిరర్థకముగ ఏ చెడ్డపనికూడ జరుగదు. లోకము కొందఱను మంచివారని శ్లాఘించును; కొందఱను దుష్టులని గర్హించును. కాని యీ రెండును గూడ యీశ్వర విలాసములే. కేవలము మంచిగాని, కేవలము చెడ్డగాని ప్రత్యేకముగా లోకమున నుండవు. లోకమంతయు

రెంటియొక్క సమ్మేళనము. ఒకదానినుండి మరియొకదానిని విడదీయుటకు వీలులేదు.

ఈ పరమార్థ మెఱింగినవారు మనకు మంచిసంభవించినను, చెడుసంభవించినను అంతయు మంచికే యనియు, చెడునుండి మంచివచ్చుననియు నమ్మెదురు.

దీని తత్వము గ్రహించుటకు సృష్టిజ్ఞానము, వేదాంత జ్ఞాన మవసరము. అందుకొఱకే కొంతమంది చెడ్డనాపుటకు ప్రయత్నింప వలదని జెప్పెదరు. "(Resist not evil.)" ఎందుచేతననగా: చెడుగులో తన్ను దాను చంపుకొనేగుణము గలదు.

కాబట్టి చెడ్డపనులను జేయువారి నొకరు సంహరింప నవసరములేదు. తమ పనులవలన తామే చత్తురు. ఈ చెడు పను లనునవి యొక రోగము వంటివి. రోగమును పుట్టిన వెంటనే నివారింప వలయును. అటులగాక ముదురనిచ్చినచో దానికి మన ప్రాణముల నర్పింప వలసినదే. అటులనే చెడు పనులు జేయువారు గూడ. కాబట్టి లోకములో సాధ్యమగు నంతవఱకు మనము చెడు పనులను రోగములను బెంపకుండ మంచిపనులను ఆరోగ్యమును అభివృద్ధి చేసికొన వలయును. మఱియొక విషయ మే మనగా: చెడ్డపనులను జేయువారలను దండించుట మనవంతుగాదు. అది ఈశ్వరుని కృత్యము. మన మెంతవఱకును క్షమించుటకే ప్రయత్నింపవలయును.

---

Printed at the Rama Power Press, Ellore, 1932.

## 21-వ అధ్యాయము.

( త్రిలోకసంచారి నారదుడిట్లుపన్యసింపుచున్నాడు. )



గత యుపన్యాసములో సృష్టివిధానమును, వైచిత్ర్యమునుగూర్చి ఇంచుక చెప్పియుంటిని. ఈపర్యాయము వేదాంతమునుగూర్చి జెప్పదలచితిని. దేనినిగూర్చి తెలిసికొన్నచో మనకు సర్వమును తెలియగలదు ?

దీనికి ఉత్తరము వేదాంతము. వేదాంతమును తెలిసికొన్నచో మనకు సర్వమును బోధపడగలదు. సృష్టియనగా సృష్టికర్త యెవడు ? దేవుడనగా నేమి ? ఈసృష్టికి కారణ మేమి ? దానికి మూలాధార మెయ్యది ? సత్యమనగానేమి ? లోకమున మనుష్యులలో వ్యత్యాసములకు గారణమేమి? కర్మ యనగా నేమి ? విధిఅనగానేమి ? ఈమొదలైన ప్రశ్నలకు సమాధానము తెలిసికొనవలయుననిన, వేదాంతజ్ఞాన మవసరము. ఈ వేదాంత మనునది మహాసముద్రమువంటిది. ఈవిషయమును గూర్చి యనేకమంది యనేక విధములైన యభిప్రాయములు వెలిబుచ్చియున్నారు. ఆయా యభిప్రాయములను బట్టి యనేకమతములు ప్రబలియున్నవి. కాని ఈ మతములన్నిటికినిసమానమైన విషయములు గొన్ని గలవు. పెద్దపెద్దసూత్రములలో అన్ని మతములు నేకీభావమును దెల్పుచున్నవి. అన్ని మతములు దేవు డొక్కడే యని

ఘోషించుచున్నవి. అన్నిమతములు సత్యమును, ధర్మమును, న్యాయమును శ్లాఘించి, అసత్యమును, అధర్మమును, అన్యాయమును నిరసించి ఖండించుచున్నవి. గొప్పగొప్ప మతగురువు లందఱు లోకమున కొక్కటే సత్యమును ధర్మమును ప్రబోధించిరి. ఆయామతస్థు లవలంబించు మార్గములందు వ్యత్యాస ముండవచ్చును. గాని వారందఱ గమ్యస్థాన మొక్కటియే. అది మోక్షదాయక మగు సచ్చిదానందమును బొందుట. ప్రతి మానవునియందును మూడుగుణములు గలవు. అవి-దైవ, మానవ, రాక్షస గుణములు. ఈ గుణములలో నెవ రెవ రేయే గుణముల నభివృద్ధి జెందింతురో వా రాతరగతిపురుషులఁ జెందుదురు. కొంతమంది తమలోనుండు దైవగుణము నణచివైచి రాక్షస గుణ మభివృద్ధి జెందింతురు. ఈరకపు పురుషుల మాటలు, చేష్టలు, రాక్షసజాతికి జెందినవిగా నుండును. మరికొంతమంది తమలోనుండు రాక్షసగుణము నణచివైచి దైవగుణము నభివృద్ధి జెందింతురు. వీరినే దైవసంభూతులందురు. వీరు ఇంచుమించు దైవమునకు దగ్గరగానుందురు. తనయందుండు రాక్షసగుణము నణచివైచి, దైవగుణ మభివృద్ధి జెందించుటకు ప్రతిపురుషునకును సాధ్యమగును. ప్రతిపురుషుడు తన మతసిద్ధాంతప్రకారము జీవించినచో నది తప్పక సాధ్యపడును. మత మననది ప్రతిపురుషుడు పఠించి నేర్చుకొన

డగిన విషయముమాత్రముగాదు. "మత మనఁగా? ధర్మ తత్పరత్వము. ధర్మమునకు అంతఃకరణము పుట్టినిల్లు. అంతఃకరణమునకు ఆత్మ అధిష్ఠానదేవత. ఇట్టి మతమును ప్రతిజీవియు నుజ్జీవింపవలయును," అని వివేకానందస్వామి చెప్పియున్నాడు. మనయందుండు దైవత్వమును వెల్లడి చేయుట మత మగును. విద్యయనగా: మనయందుండు సంపూర్ణత్వమును వెల్లడిచేయుట.

కాబట్టి ప్రతిమానవుడు తన నిత్యకృత్యములలో తన మతబోధ ననుసరించి ప్రవర్తింపవలయును. మతమనునది, దైవభక్తి యనునది, గుళ్ళుగోపురములందు, తీర్థయాత్రల యందు, వట్టినోములందు, వ్రతములందు, సంతర్పణములందు లేదు. మత మనునది: మన దినచర్యలందును, మన వాక్కు లందుగలదు. "తలలు బోడులైన తలపులు బోడులా విశ్వదాభిరామ వినురవేమ" అను వేమనవాక్యమునం దెంతయో సత్యముగలదు. 'చేసేది శివపూజలు, దూరేది దొమ్మరగుడిశెలు' అను లోకోక్తిని వినియున్నాము. కొంతమంది అన్యాయముగా సొమ్మును సంపాదించి దానములు, ధర్మములు చేయుటవలన తాము చేసిన అన్యాయముయొక్క పాపము తప్పిపోవునని తలతురు. అట్లు తలచుట పొరపాటు. దేనిఫలముదానిదే. దేనిపాపము దానిదే. ఒక ఉదాహరణము: రామదాసుచరిత్రమును

తీసికొనడు: సర్కారువారికిజెందిన 6 లక్షల రూప్యములతో సత్రవులు, గుళ్ళు, గోపురములు కట్టించి, బ్రాహ్మణ సంతర్పణలు, శ్రీరామోత్సవములు మొదలైనవి జరిపెను. రామదాసు గొప్ప రామభక్తుడే అయినను తాను సర్కారు పైక మపహరించి నందుకుగాను కారాగృహవాసము తప్ప లేదు. ఆనేరమునకు దండన యనుభవించినాడు. తన గొప్ప భక్తికి ధర్మకార్యములకు తత్ఫలముగు మోక్ష మనుభవించి నాడు. కాని గొప్ప భక్తునుగదా యని దేవుడు దయదలచి రామదాసును దండననుండి తప్పింపలేకపోయెను. కాబట్టి మనము జేయు మంచికార్యములకు మంచి ఫలము, చెడు కార్యములకు చెడుఫలము అనుభవించు తీరుదుము. మత బోధలనుమనస్ఫూర్తిగా గాక పైడాబుకొరకు అవలంబించు వారికి దానికి తగినఫలమే దొరకును గాని యంతకంటె యధికముగా నేదియు సంభవింపదు.

---

## 22-వ అధ్యాయము.

(త్రిలోక సంచారి నారదు డీపర్యాయ మిట్లుపన్యసించుచున్నాడు.)



గత యుపన్యాసములో మతమునుగూర్చియు, పురుషు డెట్లు తన నిత్యజీవితమందు మతబోధల నవలంబింప వలసిన యావశ్యకతను గూర్చియు జెప్పియుంటిని. మతమును ఇతరుల

నవలంబింపమని బోధించుటకును, తాను స్వయముగా దాని నవలంబించుటకును వ్యత్యాసముగలదు. ఎవరిమతమును వారు స్వయముగా నర్థము జేసికొన్నచో ఇంకొక మతమువారితో కొట్లాడవలసిన యావశ్యకతగాని యింకొక మతమును దూషించుటగాని తటస్థింపదు. ఈమత సంబంధమైన చర్చలు కొట్లాటలు దూషణలు అన్నియు ఎవరి మతమును వారు సరిగ యర్థముజేసి కొనకపోవుటవలన గలుగుచున్నవి. అన్ని మతములు దేవు డొక్కడే యని ఒప్పుకొనుచు, ఒక్కటే సత్యమును ధర్మమును ఘోషించుచున్నవి. కొంతమంది తమ మతమే మంచిదనియు, మిగిలినమతము లన్నియు చెడ్డవనియు బోధింతురు. ఇట్లు దురోబ్ధగావించుట న్యాయముకాదు. అందుమూలమున వారి మత మభివృద్ధి జెందజాలదు. మన మెంత మెఱుగు బెట్టినను ఇత్తడి ఇత్తడియే యగును గాని బంగారముతో సమానమైన మెఱుగు పొందదు. మనమత మును మన మెంత యధికముగా జెప్పుకొన్నను అంతమాత్ర మున దానికి లేనిపోని యాధిక్యము కలుగజాలదు. అన్నిమత ములందును మంచి చెడ్డలు సమానముగా నుండును గాని, హెచ్చు తగ్గులుగా నుండజాలవు. మన హిందూమత మెంత మందిచేత నిరసింపబడి ఖండింపబడినను ఎన్ని రాజ్యములగుండ నాగరకతలగుండ వెడలినను వీటి నన్నిటిని జయించుకొని వచ్చి ఎప్పటికంటె అప్పుడు ప్రకాశమానముగా వెలుగు

చున్నది. ఇదియే మన హిందూమతముయొక్క మహత్తు. ఇన్నివేల సంవత్సరములనుండి వికసించుచున్న మన హిందూమత మెప్పటికైనను నాశనము జెందగలదా? నేటి ప్రపంచ సంక్షోభములో లోకమందలి జాతులన్నియు శాంతి కొరకు తల్లడిల్లుచుండ, మనభారతదేశములో మనము మరల హిందూమత సిద్ధాంతము యొక్క మహిమను గుర్తెఱింగి దానిని పునరుద్ధరింపజేయుటకు ప్రయత్నించుట మిక్కిలి శుభసూచకము. హిందూమతముతోబాటు పూర్వపు హైందవ నాగరకత, పూర్వపు వేదమంత్రములు, వేదాంతపురాణములు మొదలైనవన్నియు పునరుద్ధరింపబడగలవు. మనజాతి యొక్క ఔన్నత్యమంతయు మతముపై నాధారపడియున్నది. కాబట్టి మతమును కాపాడుబాధ్యత మనపై గలదు. మతమందు సంపూర్ణమైన సత్యము, ధర్మము ఉన్నపుడు స్వమతమును వీడి యన్యమతమును స్వీకరింపనేల? మన మోక్ష సంపాదనకు మతబోధ నవలంబించుట యవసరము. తన మతమును తిరస్కరించి వ్యతిరేకముగా ప్రవర్తించువాడు మోక్షమెన్నటికిని పొందనేరడు.

ఇంక వేదాంతమును గూర్చి ఇంచుక చెప్పెదను. లోకము నేనిదివరలో జెప్పినట్లు మంచిచెడ్డలతోను కష్టసుఖములతోను గూడుకొనియున్నది. మంచి కలిగినపుడు సంతోషించుట, చెడుకలిగినపుడు దుఃఖించుట మానవస్వభా

వము. కాని పురుషుడు ఎల్లకాలము అనగా సుఖదుఃఖముల రెంటియందును ఆనందముగా నుండుటకు విశేషమైన వేదాంతజ్ఞాన మవసరము. వేదాంతమును నేర్చినవాడె మహా జ్ఞాని. జ్ఞానియే నిర్భయుడు. భోగికి రోగభయము, ధనవంతు నకు దొంగలభయము, ఈవిధముగా యందఱకు అన్నిభయ ములు గలవు. కాని జ్ఞానికి మాత్రము ఏవిధమైన భయమును లేదు. ఆతడు సదానిర్భయుడు. మన పురాణకథలు, రామా యణ మహాభారతములందలి కథలన్నియు మన నీతిబోధకును వేదాంతబోధకును ఏర్పడినవి. మనము జన్మమెత్తిన పిదప కష్టములుపొందక తప్పదు. కష్టములన్నియు సంప్రాప్తమైన పుడు మనల రక్షించి మనస్సునకు ధైర్యస్థైర్యము లొసగునది వేదాంతమే. వేదాంతజ్ఞానము లేనివాడు ఎల్లకాలము విచార సాగరమందు మునిగి తేలుచు తన జన్మను నిరర్థకము జేసి కొనవలసినదే. కొంతమంది వేదాంతమును వేదాంతులను నిరసించెదరు. అన్నియు నడిగినపిదప మిగిలినది వేదాంత గదా యని నిరసనగా మాట్లాడుదురు. కాని యట్లు నిర చుట భావ్యముగాదు. కొందఱు తమ యాస్తినంతను గోలా యి యప్పుల పాలయినను భార్యపుత్రాదులను పోషింపలేక యెన్నికష్టము లనుభవించుచున్నను ఎల్లప్పుడు నిశ్చింతగా గనబడుచు కాలమును గడుపుదురు. మరికొందఱు ఎంత ఐశ్వర్యమున్నను తమ కేవిషయమందును లోటులేకపోయినను

నేదియే నొక చింతను కలుగజేసుకొని యెల్లప్పుడును విచారముగా నుండెదరు. దీనికి కారణమేమి? మొదటిరకపు మనుష్యులలో వేదాంతము పూర్తిగా ముదిరినది. రెండవరకపు మనుష్యులలో నది కొంతగా నున్నది. ఇంతకు మనస్సునకు ప్రధానమైనది యానందము. మొదటిరకపు మనుష్యులను జూచి ఇతరులు విచారించి జాలిపడుదురుగాని వారిలో నెంత మాత్రమును విచారచిహ్నమే గనబడదు. అట్టివారి మన స్స్వాస్థ్యము తప్పక మెచ్చుకొనవలసినదే? వేదాంతమే లేనిచో నిత్యము సంభవించు కష్టపరంపరలను మన మనుభవింప గలమా? కాబట్టి పురుషులందఱు కొంతవరకు వేదాంత మలవడ జేసికొనుట యవసరము. దానిమూలమున ఇహాపర సుఖములు రెండునుగూడ సంప్రాప్తము కాగలవు.

---

## 23-వ అధ్యాయము.

(త్రిలోకసంచారి నారదు డిట్లుపన్యసించుచున్నాడు.)



గతయుపన్యాసములో మతావలంబనమునుగూర్చియు వేదాంతావలంబమును గూర్చియు, యించుక జెప్పియుంటిని. ఈపర్యాయము మతమునకును గుణమునకును గల సంబంధమునుగూర్చియు వాటి విలువనుగూర్చియు జెప్పెదను. మత సిద్ధాంతములను సరిగ నవలంబించువారి గుణము అనగా సౌశీల్యముకూడ చక్కగనుండును. మతమునకును సౌశీల్య

మునకును అన్యోన్యమైన సంబంధముగలదు. సౌశీల్యసంపదకు పునాది మతావలంబనము. గొప్పతనమునకు వలసిన ముఖ్య విషయములలో సౌశీల్యము మొట్టమొదటిది. పురుషుని గొప్పవానిగ జేయునదియు, గొప్పతనమును రాణింపజేయు నదియు సౌశీల్యము. అనేకవిధములైన గొప్పవారు గలరు. నాయకులు, మతగురువులు, ధనవంతులు, విద్యావంతులు మొదలైనవారు. పురుషుడెంత విద్యావంతుడైనను, ఎంత ధనవంతుడైనను సౌశీల్యములేనిదే రాణింపదు. ఆతనికి సంఘములో గౌరవముండదు. ధనము లేకపోయినను, విద్య లేకపోయినను సౌశీల్యముగలవారు సంఘములో గౌరవింప బడుదురు. కాబట్టి ధనము, విద్య, సౌశీల్యము ఈమూడింటి లోను నేను సౌశీల్యమునకు ప్రాముఖ్య మొసగెదను. విద్యకు దగిన ధనము, ధనమునకు దగిన విద్య యీరెంటికిని తగిన సౌశీల్యముగల పురుషు డుత్తము డనిజెప్పక తప్పదు. కాని యటువంటివారు యరుదుగ నుందురు. సర్వాతిశయములు నొక పురుషునియందు నిబిడీకృతమై యుండుటఅరిది. ప్రతి పురుషునియందును నేదియో యొక కొఱతయుండుట మానవ స్వభావము. ఇంతకు లోకములో పురుషుడు సంపాదింప వలసినది సౌశీల్యసంపద.

సౌశీల్య మనగానేమి ? సౌశీల్య మనుపదము మిక్కిలి సమీచీనమైనది. దానిని చులుకనగా వివరించుటకు వీలులేదు.

సౌశీల్యమునకు ప్రధానలక్షణము: ధనాపేక్ష లేకయుండుట; ధనమునకు లొంగకుండుట; దీనిలోకూడ హెచ్చు తగ్గులు గలవు. ఒక ఉదాహరణము: కొంతమంది యెంతవిద్యావంతులైనను ధనమునకాశించి చేయగూడని పనులన్నిటిని జేయుదురు. ఇటువంటివారికి ధనమే ప్రధానము. మరికొంతమంది స్వల్పమొత్తమునకు లొంగకపోయినను పెద్దమొత్తమునకు లొంగుదురు. ఇట్టివారుగూడ సౌశీల్యము లేనివారే. నిజమైన సౌశీల్యము గలవారి నెంత సొమ్మైయినను లొంగ తీయజాలదు. సౌశీల్యసంపదకు ధనాపేక్షను జయించుశక్తి గలదు. ధనాపేక్షను జయించుటకు కొంత మతావలంబనము వేదాంతజ్ఞాన మవసరము. మరికొంతమంది ప్రజాభిప్రాయబలముతో గొప్ప పలుకుబడియు, సంఘములో ప్రాముఖ్యమును సంపాదించినపిదప, ఆపలుకుబడిని ప్రజోపయోగముకొఱకు వినియోగించుటకుమారుగ స్వప్రయోజనముకొఱకు ఉపయోగింతురు. ఇట్టివారందఱు సౌశీల్యము లేనివారని జెప్పవచ్చును. ప్రస్తుతము మనదేశ మింతహీనస్థితిలో నుండుటకు కారణము మననాయకుల పెక్కు-రలో సౌశీల్యము లేకపోవుటయే. పురుషుని లొంగదీయునది ఆడుది; అర్థము. ఈరెంటికిని లొంగనివాడే మహాపురుషుడు. అట్టివారు అరుదు. కొందఱు నాయకులు గలరు. వారొకవైపున ధనము సంపాదించుచు మరియొకవైపున దేశముకొఱకు

స్వార్థత్యాగము జేయుచున్నామని జెప్పుకొందురు. ఒక రూపాయిగలవాడు దానిలో అర్ధరూపాయను దానము జేసినచో ఆతని స్వార్థత్యాగిఅని జెప్పవచ్చును. నూఱు రూపాయలుగలవా డొకరూపాయి ధర్మము చేసినచో అందు స్వార్థత్యాగ మేమిగలదు? అటులనే 100 లక్షలు గలవా డొకలక్ష దానము జేసినచో అది స్వార్థత్యాగ మగునా? స్వార్థత్యాగ మనగా: మన మొసగు సొమ్మొయొక్క హెచ్చుతగ్గుల బట్టియుండదు. అసలు మనదగ్గరనుండు దానిని బట్టియు దానిలోనుండి మన మొసగుదానినిబట్టియు నుండును.

100 లక్షలలో ఒకలక్ష దానముచేయు వానికంటె ఒకరూపాయిలో నర్ధరూపాయి దానముచేయువా డెక్కువ త్యాగియనజెల్లును. 100 లక్షలు గలవాడొక లక్ష దానము చేయుటలో తన విధ్యుక్తమును నెరవేర్చుచున్నాడు గాని స్వార్థత్యాగి కాఁడు. కాబట్టి మన దేశనాయకులలో ఎంతమః స్వార్థత్యాగము జేయుచున్నారో పరిశీలించినచో నిగ్గు తేల గలదు. సౌశీల్యమునకు త్యాగము ముఖ్యలక్షణము.

మఱియొక విషయ మేమనగా: కొందఱు తమ హృదయము మంచి దనియు గాని తమ చెడుచేష్టలకు తమ చెడుస్వభావము కారణమనియు జెప్పుచుందురు. కేవలము హృదయము మంచిగా నున్నందువలన లాభములేదు. మన చేష్టలుగూడ మంచివిగా నుండవలయును. మనిషియొక్క

మంచి చెడ్డలు వానిచేష్టలనుబట్టి నిర్ణయింపబడును. గాని వానియొక్క హృదయ వర్తనముబట్టి కాదు. వానిచేష్టలసభ్యముగా నున్నప్పుడు వాని హృదయము మాత్రము మంచిదిగానుండిన నేమిలాభము? హృదయము మంచిగా నున్నవారు తమ చెడుస్వభావమువలన ఇతరులకుచేయదలపని హానిజేయుచుందురు. ఇటువంటివారి యందుగూడ, సౌశీల్యసంపద కొఱతగా నున్నదన్నమాట. సౌశీల్యసంపదకింకొకయభ్యాస మవసరము. మనముజేయు ప్రతికృత్యము నకును సర్వసాక్షియగు సర్వేశ్వరుడున్నాడను సంగతి జ్ఞప్తి యందుంచుకొన్నచో మనముచేయు దుష్కార్యములంత ధైర్యముగా జేయము. మనముచేయు ప్రతికార్యమునకు ఈలోకములో తప్పించుకొన్నను ఇంకొకలోకములో ఇంకొకరికి జవాబుజెప్పవలసి యుండునను సంగతినిగూడ మఱవగూడదు. ఈసంగతుల నన్నిటిని మనమునం దుంచుకొని యాత్మశిక్షణమును ఆత్మపరిశోధనను గావించుకొనువాడు సౌశీల్యధనుఁడు, సచ్చరిత్రుఁడు అనఁ బరఁగును.

---

## 24-వ అధ్యాయము.

త్రిలోకసంచారినారదుడీపర్యాయ మిట్లుపన్యసించు చున్నాడు:—



గత యుపన్యాసములో మతమును గూర్చియు, సౌశీల్యమును గూర్చియు, రెంటికినిగల సంబంధమును

గూర్చియు జెప్పియుంటిని. పురుషుడు విజయము పొందవలయుననినను, కీర్తివంతుడు కావలయుననినను సౌశీల్యసంపద యెక్కువగా గడించు టవసరము. కొంతమంది అతిస్వల్పకాలములో విజయ మందుటకు కీర్తిని సంపాదించుటకు ప్రయత్నింతురు. అందుకొరకు కక్కుర్తిపడి యవలంబింపకూడని పద్ధతుల నన్నిటిని యవలంబించి తమ సౌశీల్యసంపదను త్యాగము జేసెదరు. తాత్కాలిక లాభమును జూచుకొనువారికి తరువాత నన్నియు చిక్కులే సంభవించును. మనిషి యెల్లపుడును దీర్ఘదృష్టి గలిగి యుండ వలయును. తాత్కాలిక లాభము, విజయము - తరువాత నష్టముగను, అపజయముగను పరిణమించును. తాత్కాలిక కష్టము, అపజయము - అటుపిమ్మట లాభముగ, జయముగ బరిణమింపవచ్చును. కీర్తి యనునది, విజయ మనునది పర్వత శిఖరముల వంటివి. శిఖరమునకు క్రమముగా ఎక్కవలయునుగాని ఒక్కపర్యాయ మెగురుటకు ప్రయత్నింప రాదు. లోకములో మహాపురుషుల జీవితములం దిలకించినచో ఈ విషయముల యందలి సత్యము బోధపడగలదు. గొప్పవారందఱు ఒక్క నిమిషములో ఒక్కదినములో గొప్పవారు కాలేదు. వారెంత కాలమో కృషిసల్పి నిశ్చయమైన ఆత్మశిక్షను గావించిన పిదప గొప్పవారైరి. మన కృషి ఎల్లప్పుడును మానసిక సంస్కారమందు గొప్పవారి నాదర్శముగా గైకొని వారిలో

నుండు లక్షణములను మన నిత్య జీవనములో నలవడ జేసి కొనుటకు ప్రయత్నింప వలెను. మన విధ్యుక్త ధర్మములను మనము సరిగ నిర్వర్తించినచో మనకు రావలసిన కీర్తి దానంతటదియే వచ్చును. కాని, దానికొఱకు ప్రత్యేకముగా పురుషులు లేనిపోని విధముల తంటాలుపడ నవసరములేదు. పురుషున కెప్పటికైనను రానికీర్తి రాదు. రావలసినకీర్తి రాకుండబోదు. దానికొఱకు యూరక శ్రమపడనేల? సచ్చరిత్రమే సాధువర్తనమే కీర్తికి మూలాధారము. స్వాభ్యున్నతియుఁ గృతకృత్యతయుఁ బొంద దలచినవారు లోకమున కెదురుజూడ గూడదు. లోకాభివృద్ధి ఎటులున్నను దాని కొఱకు మన స్వాభివృద్ధిని నిలుప గూడదు. కాలముగాని, సముద్ర తరంగములుగాని ఎవరికొఱకును వేచియుండవు. వాటిమార్గ మనుసరించి అవి వర్తించు చుండును. కాల ప్రవాహమునాప నెవరితరముగాదు. వాయువేగ మనోవేగ ములకంటె నతిత్వరితముగ కాలము గడచిపోవు చుండును. ఈ సందర్భములో మనమాలోచించుచు గూర్చున్నచో మన జీవితకాలమంతయు ఆలోచనతోనే గడచిపోవును. ప్రస్తుత లోకస్థితులెట్లున్న వనగా: పురుషుడు ఆలోచించుటకుఁ గూడ వ్యవధి లేకుండనున్నవి. పూర్వమువలెగాక ఎన్నివేల మైళ్ళయినను గంటలమీద ప్రయాణము చేయవచ్చును. లండనులో జరిగిన సంగతులు మనకు 6000 మైళ్ళ దూర

ములో నున్నను, 4, 5 గంటలలో వైర్లెస్సుద్వారా తెలియు చున్నది. కాబట్టి లోకములో నుత్తీరులు కాదలచువారు తమ జీవితకాలమును వృథా ఆలోచనతో గడపగూడదు. సాధ్య మయినంత త్వరలో తమ జీవిత యాత్రయందు ప్రవేశింపవలయును. తమ జీవితమందు తా మవలంబింప వలసిన వృత్తిని ఒక్క పర్యాయమే నిశ్చయము జేసికొన వలయును. ప్రతిపురుషునకు నేదియేనొక యాదర్శ ముండు టవసరము. ఆదర్శములేనివారి జీవితము తప్పక నిరర్థకము కాగలదు. కొంతమంది ఆలోచనలేకుండ మొట్టమొదట లాయరువృత్తి నవలంబింతురు. కొంతకాలమైన పిదప దానిలో లాభము లేదని డాక్టరు పనిబూనుదురు. అందుగిట్టుబాటులేదని టీచరు పనిలో బ్రవేశింతురు. ఈ విధముగ దేనికి పనికి రాకుండ తమజీవితమును గడుపుచుండెదరు. కాబట్టి వయస్సు వచ్చిన పురుషులందఱు తమ వృత్తిని స్థిరపఱుచుకొనుటలోనే తమ తెలివితేటలను, ఆలోచనను, దూరదృష్టిని, ఆత్మశక్తిని గః పఱుచవలయును. మనజీవితము చిట్టచివరకు మన పతకము ప్రకారముగాక యీశ్వరుని ఉద్దేశ్యానుసారమే గడచినను వీలయినంతవరకు మన పతకముగూడ మన మేర్పఱుచుకొన వలయును. జీవితములో ముఖ్యమయిన దశ యౌవనము. ఈయౌవనదశ నెంతమంది వృథా జేయుచున్నారో యూహింపుడు. మన జీవితములో ఒకరోజు గడచినదంటే ఒక రోజు

మరణమునకు దగ్గరగా వచ్చుచున్నామన్నమాట. మనము దేనినైనను తిరిగి సంపాదింప వచ్చును గాని గడచి పోయిన కాలమును మాత్రము సంపాదింపలేము. మనకాలమునంతను మనము సరిగ నుపయోగపఱచినచో మన జీవితకాలమందే మన మెంతయో యభివృద్ధి జెందవచ్చును. అపజయమునకు ముఖ్యకారణము కాలముయొక్క విలువను దెలిసికొనలేక పోవుటయే. పనిలేనివాని కేపనియైనను జేయుటకు వ్యవధి చాలదు. ఇటువంటివారి కెప్పుడును విశ్రాంతియే యుండదు. దినమునకు కాలనియతి ప్రకార మెంతయో పనిజేయువారు ఎంతయో తగిన విశ్రాంతినిగూడ ననుభవించెదరు.

ఎక్కువ పనిజేయు వానికి ఎక్కువ విశ్రాంతి గలదను వాక్యము వ్యతిరేకముగ గనబడవచ్చునుగాని అందెంతయో యదార్థము గలదు. సాధారణముగా మనల నెవరైనను ఏదైన పనిజేయమని యడిగినప్పుడు 'వ్యవధిలేదు' అని చెప్పుట వాడుకయైనది. ఈ పదములో నర్థములేదు. ఏలనన: మన యవకాశమును మనము సరిగ వినియోగించుటలేదు. దినమునకుగల 24 గంటలలోను ఎన్నియో గంటలు వృథా కాలక్షేపములో గడచిపోవుచున్నవి. ఈగంటలను మన మొసంగి వినియోగించినచో నెంతయోపని జేయ వచ్చును. కాబట్టి ప్రశస్తి పొందదలచినవా రందఱు మొట్టమొదట కాలము విలువను గ్రహించి తదనుగుణముగ వర్తించు టవసరము.

---